# తొలిపలుకులు



ఈనవలయందుఁ గరుణారసము ప్రధానమయినను దక్కినరసములును వానికంగములుగా నందందిమిడి యున్నవి. ఆయాసందర్భముల నాయారసము లవియే ప్రధానములా యను నూహానాపాదించు చుండును.

సత్యవతియొక్క సతీత్వమును, సమయస్ఫూర్తియును; మహామాయావి యొక్క వంచనా వైశద్యమును, ముఖస్తుతి పాండిత్యమును వర్ణనాతీతములు.

మంత్రములు, దుశ్శకునములు మున్నగు వానియందలి మూఢవిశ్వాసముల గుఱించియు; స్త్రీవిద్య, బాల్యవివాహము మున్నగు నవనాగరకములను గుఱించియుఁ జక్కఁగా వెల్లడి పఱచియున్నది.

ఇట్లు,

గ్రంథకర్త

[redacted] ఈ. భాష్యకాచార్యులు

ప్రధానాంధ్రోపాధ్యాయులు

హిందూ హైస్కూలు-తిరువల్లిక్కేణి,

మదరాసు.



శ్రీరస్తు.

# సత్యవతి



మొదటి ప్రకరణము.

## ప్రణయ దంపతులు.



ఒకనాఁటి సాయంకాలము రాజమహేంద్ర వరము నందలి గోదావరీ తీరమున, ఒక విశాలస్థలమున, ఇరువురు ప్రణయదంపతు లాసీనులై యుండిరి. వారు గోదావరీ తరంగ డోలికలఁ దూఁగులాడు పడవల సొంపుంజూచుచు, నయనపర్వ మగు నా సాయంసమయశోభ కెద నానందించు చుండిరి. గౌతమియు నభ్యాగతులగు నా దంపతుల సత్కరించుచున్నదో యన, నిజతరంగ శీతల శీకర సంపృక్త సుగంధ వాతపోతముల, శ్రమాపనోదము గావించు చుండెను. వారి కించుకదూరమునఁ గొందఱు బాలురాసీనులై యిట్లు సంభాషించు చుండిరి.

లక్ష్మీనరసింహము.—ఓరీ, వేంకటేశ్వరుఁడూ! ఈ తూఁటియును నీమధ్యమ తరగతి పరీక్షా ఫలితము సున్నయై నట్లే తోఁచుచున్నది. నిన్నటి వార్తాపత్రిక యందునీ సంఖ్య గానుపించుటలేదే!

వీరేశలింగము.—ఈ మాత్రమునకే యింతడంబము లాడవలసెఁగా! నిన్న మొన్నటి నీయాధ్ధత్యమును జూచి, నే నును భ్రమించితిఁ గదా!

వేంక.—నాకీ సందర్భము మున్నే తెలియును.

లక్ష్మీనర.—అదెట్లు?

వీరేశ.—ప్రశ్నలకు సరిగా నుత్తరము లియ్యక పోవు టయే కారణమని తెలియఁజాలవా?

వేంక.—అదిగాదు. నా శరీరము జబ్బుపడుటచేఁ జదు వు చక్కఁగాఁ సాగకుండెను. దానిమూలమునఁ బ్రశ్నల కుత్త రము అంతసరిగా వ్రాయఁజాలనైతిని.

జోగయ్య.—తలిపుట్టి నింటిమహిమ మేనమామ యొద్ద నాపొగడఁకొనుట? నీ చదివిన చదువెట్టిదియో నేనెఱుఁ గనా? ఊరక యచ్చటికేఁగి ప్రశ్నపత్రికల నందికొనిన నుత్తర మట్టియుట్టి పడివచ్చునా?

లక్ష్మీ.—అయిన నింకఁ జెన్నపురిని ఈతఁడు చేసిన దేమిటి?

జోగయ్య.—చీట్ల పేకలాడుట, నాటకముల దర్శింప నరుగుట, పాటకచ్చేరిలకుఁ బోవుట, ఇవియన్నియు నీతఁడా చరించుచుండిన గొప్ప కార్యములు.

లక్ష్మీనర.—పాపమీతనితండ్రి నెలకు నూఱు రూప్య లంపుచుండెడి వాఁడు. దాని నొలకఁ బోసికొని యిట్టి దుశ్చ ర్యలా ఈతఁ డభ్యసించినది!

జోగయ్య.—ఇంకను నధికముగా నభ్యసించియున్నాఁడు. చుట్టలుపట్టుట యందీతని సాటివారెవరును లేరు. దినమున కొక్క కట్టయైనను జాలదు. తండ్రి పంపునట్టి ద్రవ్యమంతయును నిరువది తేదులకు లోపుగనే వ్యయపడుచుండును. ఆవల పుస్తకములను ఘటికారము, మున్నగువానిఁ గొన్నింటి నమ్మి తక్కిన దినములు గడపుచుండును. ఇట్లు దుర్వ్యయములయం దాసక్తుఁడైన వాఁడు, మఱలఁ జదువు కెక్కెడిది? ఉపాధ్యాయులును వీని దుశ్చర్యలఁ గొంతవఱకుఁ గనిపెట్టి అప్పుడప్పుడు బడినుండి తఱుముటయు గలదు.

వీరేశ.—ఔరా! తనయల్లుఁడు చదివి కృతార్థుఁడు గాఁబోవుచున్నాఁడని యెంచి యీతని మామ సుబ్బావధాను లెంతయు మురియు చుండు. ఈనడుమననే ఈతనికి వజ్రపుటుంగర మొకఁడొసఁగియుండు. ఇట్టి నీచునిఁ బరిణయమాడిన యా సుందరికి సుఖ మెట్లబ్బఁగలదు?

జోగయ్య. — ఆయుంగర మిప్పుడెచ్చట నున్నదో యెఱుఁగుదు.

లక్ష్మీనర.—వేంకటేశ్వరుఁడూ! నీ మామయిచ్చిన వజ్రపుటుంగర మిప్పుడెచ్చట నున్నది?

వేంక.—నా యుంగరముమాట యటుండనిండు. ఈ జోగయ్య తానెంతయో శుద్ధుఁడగునట్లు నన్నాక్షేపించుచున్నాఁడు. తనయాడిన చదరంగముమాట బయలుపుచ్చెనే? ఒరులకు నోరికివచ్చినట్లు చెప్పవచ్చుఁగాని తామాచరించుటయసాధ్యమగును.

వీరిటు మాటలాడుచుండ నొకశాస్త్రిలు గోదావరీ

సైకతమున విహరించుటకై వచ్చియుండెను. అతఁడు వీరి సంభాషణల నాలకించి వేంకటేశ్వరుని సమీపించి;

శాస్త్రులు.—వేంకటేశ్వరుఁడూ! నీ మామ గొప్ప ధనికుఁడు. ఆతనికి నియం దెక్కుడుప్రీతి. ఈవృత్తాంతము నాతనికిఁ దెలుపఁదలఁచి యున్నాను. వైదిక వంశమునఁబుట్టి చుట్టలు ద్రాగుటయా! ఇంతకంటె హీనమొక్కం డుగలదా?

వేంక.—నీబోటి బోడి బాపనయ్య లెందఱుచేరిన నన్నేమి చేయఁగలరు? నీమాటలకు నే బెదరువాఁడఁను గాను.

జోగయ్య.—పెద్దవారినిజూచి గౌరవించుటకు మాఱు ఇట్లు దూషించుటఁ బాడిగాదు.

వేంక.—ఆకారమునుజూచి గొప్పవారని భావించుట నామతముగాదు.

దూరమునుండి వీరిమాట లాలకించు చుండిన ప్రణయ దంపతు లిల్లని సంభాషింపఁ జొచ్చిరి.

"ప్రేయసీ! చూచితివే యీకలికాల మహాత్మ్యము! పెద్దలు చిన్నలను బుద్ధిలేక నోటికి వచ్చినట్లు ఈతఁడు వదరుచున్నాఁడు. 'విద్యయొసఁగును వినయం'బనుట వీనియెడలఁ బనికిరాకున్నది. తల్లిదండ్రు లంపిన ద్రవ్యమును వృథావ్యయపఱచి, దుష్కృత్యముల నేర్చికొని, పరీక్షలఁ గృతార్థులుగా నట్టివారి కేయుద్యోగము లభింపఁ బోవుచున్నది! వారెట్లు మనఁగలరు? ఈకాలమున వినయమువేగ సెలవు పుచ్చుకొనను. అహంకార మన్నిటికన్న మిన్నయై నిలచును. ఇదియా వీరి చదువవలని ఫలము? ఇంతకు నిట్లగుటవీరి దోషముగాదు. సుతులు చెడ్డవారైనఁ బితరుల తప్పేయగు. ఒంటరిగఁ జెన్నపురిని విడుచుటచేఁగదా వారి కట్టి దురభ్యాసములు గల్గె!

తండ్రులు పరామరికగల్గి తగు జాగ్రత్త పుచ్చుకొని యుండిన సుతులుసత్ప్రవర్తనులై యుందురు కాదె!

"నాథా! కేవల కలిమాహాత్మ్యమే కాకున్న నిట్టి దుష్ప్రవర్తన లలవడుట యంత సులభముకాదు. జనకుల యశ్రద్ధకారణముకాదని నేఁ జెప్పఁజాలనుగాని పూర్ణమగు హేతువది యగునని మాత్రము నమ్మను."

'అవును. నీవాడిన ట్లీకాలమహిమ యట్టిదియే యగు. ఆహా! ఈవింత నాగరకము తలఁచుకొలఁదినా కట్టె నవ్వు పుట్టుచున్నది. చూడుము. ఈకాలపు స్త్రీలు సౌమంగల్య సూచకమగు మంగళసూత్రము కానుపించిన నవమానమని యెంచెదరు తక్కిన భూషణములెల్ల నఱుతఁ బ్రకాశించుచుండినను పుస్తెయొక్కటిమాత్ర మంతర్గతమై యుండు. ఐదువతన మునకు ముఖ్యమగు పసుపు పూసికొనుట యన్న నేవగింత కగులుచున్నది. కంచుకములఁ బురుషులవలె ఆమణిబంధము ధరింతురు. మగవారలకంటె మున్నుదామే సభలనలంకరింపఁజూ చెదరు. వీరు, మగవారుప యోగశూన్యులని తలంచుచుందురు.

"అగును. పురుషులును మోచేతులవఱకు చొక్కా యిధరింతురు. స్త్రీలుతమకన్న నుచ్చదశకు రావలయునని పాటు బడుచుందురు. తమభార్యలు స్త్రీలసభల నుపన్య సించుచుండఁ దాముదూరముననుండి యాలకించుచు నుత్సాహ పూరితులై యుందురు. మగ లిట్లుండుటచేతనే యాండ్రకు వారివిషయమున గౌరవముండఁ బోదని భావింతును."

"చెలీ! నాటకసందర్శనాది సమయములందును సాయం కాలవిహార సందర్భములను నీవును నాతోడ వచ్చుచుండుటఁ జేసి ఇదియు నట్లె యగునని తలఁతువా!"

"నాథా! నే నాడినది లోకసామాన్య విషయమే కాని నాయట్టిహాంద్రయెడ కాదు. పురుషుని యాజ్ఞమీాఱి, ఆతని నరకుసేయని పడఁతుక జన్మము వమ్మని నే నెఱుంగుదును. పతియే భామలకెందును దైవము. వారి దిరస్కరించినచో దైవము దమ్ము శిక్షించును. ఇయ్యది యెఱుఁగక యుండునట్టి నీచల నాకేల సాటి తెచ్చెదరు?"

"కాంతా! ఊరక పరియాచకమునకై యాడితి నంతియకాని నీమనసు గుఱుఁగని వాఁడనే?"

వీరిటు మాటలాడుచుండఁగ నొక రక్షకభటుఁ డరుదెంచెను. అతఁడొక యుత్తర మాపురుషుని చేతికిచ్చి;

రక్షకభటుఁడు.—అయ్యా! ఈ యుత్తరము నేఁటి యుదయమునవచ్చినది. మనవాకిటఁ గల టపాపెట్టెలోఁ టపా బంట్రౌతు వైచిపోయెను. అది తెల్లవారి నే జాబులెత్తునపు డేమూలనో యిఱికికొని యుండుటచేఁ గాన్పింపదయ్యెను. సాయంసమయమునఁ దమయుత్తరవుచోప్పున కచ్చేరి కాగితములు గలపెట్టె నింటికిఁ దీసికొని పోయినపుడు టపాపెట్టె తలుపుసందున నిఱికి కొనియుండు నీజాబుంగాంచి దీనిఁ దమకందిచ్చుటకై పర్వుపర్వున నిట కరుదెంచితిని.

ఆపురుషుఁడు నా యుత్తరమందికొని యిట్లని చదువఁ దొడఁగెను.

నెల్లూరు.

చిరంజీవులగు వేంకటేశ్వరుఁడుగారికి అనేకాశీర్వాదములు:

ఇచ్చట మీామఱఁది ప్రకాశము సుఖముగాఁ జదువు కొనుచున్నాఁడు. మీాయత్తగారును మీాదంపతుల యోగక్షేమమును దెల్పుమనిరి. చిరంజీవి ప్రకాశము "నాయనా!

అక్కయ్యను నాకెపుడు తెచ్చి చూపెదవు" అనిన న్నునిర్బంధించుచున్నాఁడు. రాఁబోవు దీపావళికి మీరిరువురు నిచ్చోటికి రావలయునని మీయత్తగారు తెల్పుమనిరి. సౌభాగ్యవతి సత్యవతియొక్క కుశలవార్త నెఱింగింపవలయును. దానికిని మా యోగక్షేమోదంతము ఎఱిఁగింపవలయు. భాగీరథీ సమానురాలగు మాయక్కగారితో నానమస్కారములను దెల్పవలయు. ఇచ్చట సౌభాగ్యవతి మీసోదరి జానకమ్మ భర్తయింట సరిగాఁ గాఁపురము చేయుట లేదు. ఎప్పుడు చూచినను ఇరుగుపొరుగు రచ్చ నింటివఱకును దెచ్చుచున్నది. పాప మాబిడభర్త విశ్వనాథ మిట్టి కాఁపురము సేయుట కష్టతరమని యెంచి దుఃఖించుచుండును. అతఁడు నలుగురిలోఁ దలయెత్తుకొని తిరుగఁజాలక కష్టపడుచున్నాఁడు. ఒరులతోఁ జెప్పుకొనిన సిగ్గులచేటగునని మానసముననే యణఁచికొని తపించుచున్నాఁడు. కొంతకాల మీబిడను మీయొద్ద నుంచికొని సద్బుద్ధులఁ గఱపి యనుపుట మేలగునని నాకుఁ దోఁచెడిని.

ఇట్లు, మీ మామగారు,

వెంకటప్పలయ్య,

మండల న్యాయాధిపతి.

ఈ జాబుఁ జదివినంతనే యాతనికి సహింపనలవిగాని దుఃఖముద్భవిల్లెను. అది యెట్లో యాఁపికొని భార్యతోఁడ నింటికి వెళ్లెను.



రెండవ ప్రకరణము.

# ద్వేషాంకురము.



ఆహా! వివేకవంతుఁడయ్యు నాకుమారుఁడు నామా యలాడికి వశుఁడై దాని చేతి కీలుబొమ్మవలె నాడుచున్నాఁడు. వీని నెట్లు సరిపఱుప నగునో తెలియరాకున్నది. ఇసీ! ఆఁడుది యయ్యులజ్జ యించుకైనను లేక, భయ మిసుమంతైనను జెందక, పలువురు పురుషులుందురను శంకయైనను బొందక, మగనితోడ నాటకములుచూడ నేఁగుచున్నది. పెద్దదానను నేనింట నున్నాననియు జంకక యెప్పుడును భర్తతో మాట లాడుచుండును. ఆఁడువారికి వంటలు చేయుటయు వస్తువులఁ జక్కఁపఱచికొనుటయు నింటిని శుభ్రముగ నుంచికొనుటయు విధియై యుండ నెల్లప్పుడును బుస్తకములఁ జదువుచుండును. వివాహమునకు మున్నే నేనిట్టి దుర్వర్తనుల బిడ్డలఁ, బరిగ్ర హించుట యయుక్తమని భావించితిని గాని నాసోదరుఁడు మొండిపట్టు పట్టుటచే నంగీకరింపక తీరదయ్యె. తానెంత మండ లన్యాయాధిపతి యైనను ఆఁడు దానికిట్లు విద్యచెప్పి పని పాటుల కుపయోగము లేకుండునట్లు జెఱచుటయా మేలగు? తండ్రి పంపుచున్నట్టి స్వల్ప ద్రవ్యము మూలముననే ఇదియెంత క్రొవ్వెను? దీనికాఁపురముఁ జూచిన నిట్లున్నది. మాజానకి కాఁపురమో చాల కష్టతరసహ్యముగఁ దోఁచుచున్నది;

ఔరా! నాకూఁతు రెట్లుండిన నీతని కేమి? అధికార మదమునఁ గన్నులు గానకున్నాఁడు. అల్లుఁడెంతవశుఁడైనను పెద్దదాననుఁ నేనెంత కష్టమందుదునో యనుచింత సుంతైనను

లేక నా కుమారునికిఁ దానట్టి యుత్తరములు వ్రాయుటయా? ఒకటిరెండు తూఱులైనచో, ఓర్చికొని యుండవచ్చును గాని పలుతడవ లిట్లే వ్రాసిన నెట్లు సహింపనగును? మావాఁడును మామ యొసఁగుచుండు కట్నములకు లోఁబడి యేమియు ననకున్నవాఁడు. ఒక్కపరి యిట్టి జాబుల మీరు వ్రాయవలదని మందలించిన మరల నతఁడేల యిట్టి యుత్తరముల వ్రాయఁగడఁగును? పురుషుఁ డిట్లుండుటచేతనే యాఁడుదాని కంత గర్వముగలై. రౌతు మెత్తనైన గుఱ్ఱము మూఁడుకాళ్ళతోఁ గదానడచును! ఇట్టివాఁడు నొక పురుషుఁడా? వీని యుద్యోగము నిట్లే యుండుఁగాఁబోలు! ఒక్కతడవయైన, నీకిది భావ్యముకాదని యాడఁడు. వాఁడేల యట్లాడును! మామవలన లభించు ధనము మూట కట్టికొన వలయునని గదా వాని యభిప్రాయము! అతఁ డొఱ్ఱను వైచి చేఁపను లాగికొనువాఁడనుట తెలియకున్నాఁడు. పాపమిట్టి యమాయికుఁ డగుటచేతనే యా జాణ వీనిఁబట్టి యిష్టమువచ్చిన ట్లాడించు చున్నది. నాకేల యీ గొడవయని యెంతునుగాని యింతకాల మెట్లోకడపినదాన తుద కిప్పు డీయసభ్య వర్తనలఁ జూడఁజాలక నామదిని గుందుచున్నదాన. కుఱ్ఱవానితోఁ జెప్పిన వాఁడు మౌనమే వహించుచున్నాఁడు. నేనేమిసేయుదు? ఈ ముసలితనమున నిట్టి యనాచారవతిచే భుజించుటయు నాకిష్టము లేకున్నది.

అని యిట్లు జామిపేటలో నొకయింట నొక వృద్ధవనిత చింతించుచుండె. ఈ బిడ యెఱ్ఱపట్టంచుగల తెల్లని నారచీర ధరించియుండెను. మెడను స్ఫటికమాల యొండు ధరించియుండెను. చేతులపైనను ముఖమునను విభూతిపెండెక ట్లమరియుండెను. అత్తఱిని ఒక యువకుఁ డచ్చటికే తెంచె. వాఁడామెంజూచి;

యువ.—అమ్మా! భోజనమువేళ యాయెను, లేచి రమ్మా.

వృద్ధ.—నాయనా! నా కాఁకలిగాకున్నది. నన్నేల నిర్బంధించెదవు?

యువ.—నిన్న రేయినిగూడ భుజింపని నీకెట్లాఁకలి గాకుండె? నీవు తినకున్న నీకోడలు భుజింపదుగదా? పాపమా పసిదెంత దనుక పస్తుపడి యుండఁగలదు.

వృద్ధ.—అగునగును. అది పస్తుండిన నీకును దిన్న యన్న మఱిగిపోయి వెంటనే యాఁకలియెత్తుఁగాఁబోలు! నీవిల్లు నెత్తినఁ బెట్టుకొని పూజించు చుండుట చేతనే కదాదాని కంత గర్వము గలిగె?

యువ.—తల్లీ! నాయపరాధము లెట్టివున్నను క్షమింపుము. నేనును గచ్చేరికిఁ బోవలయును. అచ్చటి పనులం దీర్చుకొని పెద్దాపురమునకుఁ బోవలసి యున్నది. కాఁబట్టి నాయెడఁ గగుణించి నన్నుఁ గృతార్థీకరింపుము. పెద్దదాన వింటనీవి ట్లుపవసించియుండ నే భుజించుట శ్రేయస్కరము గాదు.

వృద్ధ.—అబ్బాయీ! నీవా జిత్తులమారియొక్క తేనె పూసినమాటలకు లోఁబడియుంటి వంతియకాని నీవలని యప రాధ మావంతయును లేదు. తప్పేలేని యప్పుడు క్షమించుట యేమిటి? ఇన్నియేండ్లు గడచిన విధవను నాకీ యనాచారవతి చేతియన్నము భుజింపవలసెఁ గదాయని యందులకు దుఃఖించు చున్నదానను.

యువ.—నీకోడ లట్లాచరించిన యకార్య మెయ్యది?

వృద్ధ.—ఏమైననేమి? దానికిఁ 'జరణ దాసుఁడవగు

సేవించుకైనను సరిపడ దిద్దఁగలవా? అట్లు కానినాఁడు నాయీవ్యర్థపు మాటలతో నేమి యుపయోగము?

యువ.—నీవట్లు తలఁచుట గడుంగడుఁ బొరపాటగు. ఆఁడుదాని సరి దిద్దికొనకున్న నా యపవాదము పురుషునకు గదా సంక్రమించు!

వృద్ధ.—తండ్రీ! మీ నాయనగారికి నేను రెండవ భార్యను. ప్రథమభార్యా వియోగమైన నాల్గు సంవత్సరముల కావల వారు నన్ను వివాహమాడిరి. మాయిరువురకు నత్యంతగాఢానురాగము, ఎంత ప్రీతియుండిననేమి? నల్వురియెదుట నోరు దెఱువవచ్చునే? తుదకు వాకిటద్వారము నొద్దకేని నేరాఁదగునే! అంతటికట్టుదిట్టములతో వారు నన్నేలుచుండిరి. వారు మండల కరగ్రాహిగా నుండుటచే ఊరూరును దిరుగవలసి యుండెను. అట్టియెడ నను వీడక తమతోడన పిలిచి కొని పోవుచుందురు. ఎచ్చటికిఁ బోయిననేమి? ఎల్లప్పుడును లోననే యుండవలయుఁ గాని వెలుపటికిఁ రాఁదగదు. చిన్నప్పుడు మాపుట్టినింట నాకు నక్షరములు నేర్పియుండిరి. నేనును జదువఁ గలిగినంత దాన నయితినిగాని వివాహమైన తరువాత మీతండ్రిగారు నేనే పొత్తమును జదువఁదగదనియు, ఏలేఖయు వ్రాయఁదగదనియు శాసించిరి. తన్మూలమునఁ జదువంతయుమఱచిపోయితిని. మీతండ్రిగారు మరణించునపుడు నీవును బసివాఁడ వగుటచే నీకీవిషయ మెద్దియును దెలియదు. అట్టివారి కుమారుఁడవగు నీవిట్లు పత్నికి దాసానుదాసుఁడ వగుట చూడ నెంతయు నాశ్చర్యమగు చున్నది. వండికొనుచుండునపుడును నీభార్య పుస్తకము చేతఁ దాల్చియుండును. దాని పై కాగితము గంజిచే నదుకుదురు కావున దానిఁ దాఁకి

నచో మైలయగు ననుటయుఁ దెలియకున్నది. చెప్పినను విను నని తోఁచుటలేదు. ఇన్నియేండ్లు మని కడకీ యనాచారా న్నము భుజింపవలసి యుండిన నా మన సెంతనొచ్చునో ఆలో చించుము. నీవా ఒక్కమాత్రైన దాని మందలించుటలేదు. ఎన్నియో కష్టములుపడి పెంచి పెద్దచేసి చదువునేర్పి పట్టపరీ క్షం గృతార్థుఁ జేయించితిని. దాని మూలముననే కదా నీవి ప్పుడు మండలా రక్షక భటాధ్యక్షుఁడ వైతివి! నలువురిలో నీవు ప్రసిద్ధుఁడ వగుటకు నాపడిన పాటే కారణమనిమాత్రమె నెఱుఁగ కుంటివి. కన్నతల్లియనియు నన్ను గారవింపకుంటివి. ఇట్లు దాని మాయలకుఁ జిక్కి స్వాచ్ఛందవృత్తి నభివృద్ధి గావించు చుంటివి కదా!

యువ.—అమ్మా! నీకోడలిచేతి యన్నమును భుజింప వలదు. నేనొక వంటవాని నేర్పఱచెదను లే.

వృద్ధ.—ఏమీ! భార్య యలసిపోవునని భయపడు చుంటివా? ఇట్టి సియెడ దానికేమి గౌరవముండఁ బోయెడిని? దాని మందలించుటకు నోరాడక పిల్లివలె నణఁగిపోవుచుంటివే! ఇదియా నీజ్ఞానము! పట్టభద్రుఁడ వయినందున నుదయించిన విజ్ఞానమిదియే కాఁబోలు!

యువ.—జననీ! అన్నియు నీ యిష్టము చొప్పుననే యగును. నను క్షమింపుము రమ్ము. నాతోఁడ గూర్చుండి భుజింపుము.

వృద్ధ.—ఛీ! ఛీ! ఆఁడుదానికి లోఁబడియుండు నీయ ట్టివానితోడఁ గూర్చుండి భుజించుటయుఁ దగదు.

ఈమాట లాలకించినంత నా యువకున కెంతయు నాగ్రహము గల్గెను. కన్ను లెఱ్ఱవాఱెను. ఇంతలోనఁ గన్న

తల్లి నేమియు ననఁదగదని జ్ఞప్తికి వచ్చుటచేఁ గోపమంతయు ఉపసంహరించుకొనియెను. ఎట్టి పూర్వాచారపరాయణులైనను బుస్తకమునంటిన మైలయగు ననువారలుందురే యని యాశ్చర్యపడఁ జొచ్చెను. తల్లియానతి మీఱుట తప్పుగుఁ గదా యని తల్లడిల్లసాగెను. పరమ సాధ్వీమతల్లియగు భార్యను నోనాడుట పాపావహమగు నేయని పరితపింపఁదొడఁగెను. ఏమి సేయుటకును దోఁచకుండెను ఏ తెన్నునఁ బోవుటకును బాలుపోవక యట్టె నిలచియుండెను. భార్యకుఁ జింతకలుగకుండుటకును దల్లికి సంతసము గలుగుటకు నుపాయ మాతరుణమున నేరు సెప్పఁగలరని యాలోచించుచుండెను. తుదకు, దాసరితప్పులు దండముతో సరిపోవునన్నట్లు వశీకరణౌషధము చేతినుండ సంశయింప నేల యని యొకవిధముగ మదిం గుదుటపఱచికొనియె. వెంటనే యామె పాదములపైఁ బడియె. అట్లు నమస్కరించిన కుమారుని లేవనెత్తి;

వృద్ధ:—తండ్రీ! నీపైఁగోపించితినని యెంచితివి కాఁబోలు! ఆరిక్కసి యొనర్చెడి కర్కశకృత్యముల నాచిత్తము త్తలపాటుసెందుటచే నిట్లాడవలసె నంతియకాని వేఱుకాదు. వెలవెలఁబాఱెడి నీమోముగాంచిన నాగుండె లవియు నట్లున్నది. మనకిన్ని కష్టములకును నిదాన మాసీచు రాలుకాదె!

ఈపలుకు లాలించిన యాతని మానస మత్యంతముపరితపింప మొదలిడెను. పతివ్రతా శిరోమణియగు తనభార్యనిట్లు కఠినముగా నాడుట చెవుల ములుకులు నాటినట్లుండెను. అయిన నేమిసేయఁగలఁడు! తల్లిని జూచినఁగడు భీతిలువాఁడు. కావున ఆమె మాటల కెదురాడలేక యూరకుండెను. ఆతరుణమున నొకరక్షకభటుఁ డరుదెంచి;

రక్షకభటుఁడు.—అయ్యా! పెద్దాపురమునకు బయనమగుటకుండగు సన్నాహములెల్ల మీయానతిచొప్పున జరుపఁబడియెను. విన్నవించి కొనుటకు వచ్చితిని.

యువ.—ఇదె భోజనము చేసి వచ్చెదను. న్యాయస్థానమునకేఁగి అచ్చటినుండియే తిన్నఁగఁ పెద్దాపురమునకు వెడలవలయు. నీవచ్చటికరిగి నారాకకై నిరీక్షించుచుండుము.—అమ్మా! నాయందనుగ్రహించి భోజనమునకు రమ్ము. సర్వము నీయిచ్చచొప్పునను జరుగఁ గలదు.

వృద్ధవనితయు నింకఁ దనమాటచొప్పుననే యాతఁడు నడచుకొనునవియుఁ, దనకోడలి గ్రంథావలోకనాది వికృతాచారము లడుగంటఁ గలవనియు నెంచి సంతసించెను. యువకుని వేఁడికోలు ననుసరించి ఆతనితోడ భుజించుటకు లోనికరిగెను. అచ్చట వేసియుండిన యాసనములపై వారాసీనులైరి. ఒక యువతి వారి కాకులు వేసి వడ్డించుట కారంభించెను. తల్లియును కుమారుఁడును విలాసముగా మాటలాడుకొనుచు భుజించుచుండిరి. ప్రస్తావవశమున వెంకటప్పలయ్యగారు పంపినజాబుమాట మరల వచ్చినది. అంత జనని కుపితయై ;

వృద్ధ.—ఓరీ! వయస్సైనందులకుఁ దెలివి యెక్కుడగుటకుమాఱు నానాఁటికిఁ దీసికట్టుచున్నది. నీవిట్లుండుటచేతనే దీనికింత క్రొవ్వెక్కియున్నది. వాఁడెంత మండల న్యాయాధిపతి (District Judge) యైనను ఏమిటి? వానిగౌరవము లెక్కసేయక యల్లుఁడని సన్మానించక తోఁచినట్లెల్ల వ్రాయుటయా? వాని యబ్బకాలము నాఁడు పౌరోహిత్యము సేయుచుఁ బ్రదికినది మఱచిపోయెను గాఁబోలు! కలిమిం గన్నులు గానకున్నాఁడు. ఇట్టి నీచుని కూఁతురగు దీనికి వినయ

మెచ్చటినుండి రాఁగలదు. ఇది వచ్చిననాఁటినుండియు మన యింటఁగష్టము లప్పటప్పటికి నతిశయించు చున్నవి.

ఈమాటలు వినిన యువకుఁడేమియు బదులాడక మౌనము వహించియుండెను. యువతియుఁ దనతండ్రి నట్లుకారణముగ దూషించుటకు మానసమున నించుకకష్టము నందెను గాని భర్త యూరకున్నందులకు మాత్ర మిసుమంతయుఁ గోపింపదాయె. ఎంతయణఁచి పెట్టుకొనినను నత్తయొక్క నిందావాక్యములఁ దలఁచినపుడెల్ల శోక మతిశయించుచుండెను. అప్పుడు మాఁ జువడ్డించుట కరుదెంచిన యువతి యత్త కన్నము వడ్డించునపుడు పొరబాటున చేతిపళ్లెము విస్తరిముందుఁ బడెను. యువతి నలయునని వేయకపోయిన నత్తమాత్ర, మాగ్రహమున నట్లు కోడలే విసరివైచెననిమొంచి కోపించెను. కుమారుఁడు భార్య నాయకార్యమునకుఁగాఁ గోపింపమి నాయ్యాగ్రహ మతిశయించెను. అంత "నిట్టి భార్యాపర తంత్రుని ముఖమును జూచుటయు మిక్కిలి పాప"మని యాడుచు విస్తరివిడచి లేచిచేయిఁ గడిగికొని యూరిలోని వేణుగోపాల స్వామివారి యాలయమునకు వెడలెను. అప్పుడు దేవునకు బ్రహ్మోత్సవ మగుటచే స్వామివారి నాసనముపై వేంచేపుఁజేసి వీథుల నూరేఁగింపు చుండిరి. ముందు భజంత్రీలు వాయించుచుఁ గొందఱు పోవుచుండిరి. యువకులు గొందఱు వారి రాగాలాపనముల నాలకించుచు వారి ననుసరించు చుండిరి. దేవు నచ్చటచ్చట నిలిపి హారతులిచ్చు చుండిరి. పంచ గజ్జాయ మునకును వక్కలాకులకును నర్చకులును మోతగాండ్రును అప్పుడప్పుడుఁ గలియఁబడు చుండిరి. ఈవృద్ధవనితయు నటకేఁగఁగ, అర్చకుఁ డామె శిరమున శఠారి

ననిచ్చి, చేత తులసినిచ్చెను. ఈమెయు దానింగ్రహించి వెను కననుండునాఁడు వాంఢ్రపంగలసి కొనెను. అప్పుడువారిలో నొక్కయాబిడ యొకవృద్ధ వనితంగాంచి;

యువతి.—శేషమ్మా! ఏమట్లు వెలవెలఁ బోయియు న్నావు?

శేషమ్మ—లక్ష్మమ్మా! మఱేమియు లేదు. మాయింట నొక నాగుబాముస్నదిగద.

లక్ష్మమ్మ.—ఎవరు? నీకోడలా?

శేషమ్మ.—ఔనౌను. ఆరాక్షసియే.

లక్ష్మ.—ఏమి? ఇప్పుడా బిడయేమి చేసెను?

శేషమ్మ.—లోలోనఁ దనతండ్రి పంపు ద్రవ్యమును దాఁచిపెట్టుకొనుచు పోతరించి పురుషుని లక్ష్యము చేయుట లేదు. మగనినే సరకుఁ గొననిది యత్తనేమి పూజించఁగల దనది! ఈదినము నాకాకున నన్నమిడి యన్నపుఁ బళ్ళెమును నాయూకున విసరివైచెను. ఇంతటి గర్వముదగు నాయనుట నీవే చెప్పుము. నాకంతి నాగ్రహముగల్గి యిటఁ గేఁడన్న మిట్లే పరిహరించి లేచి వచ్చితిని.

లక్ష్మ.—ఏదియో పొరపాటునఁ జేతినుండి జారిపడి యుండ నోపును. ఈమాత్రమునకే కోపగించికొనుట యేలా? నీవిట్లు మాటమాటకు నాగ్రహించిన నీపై దానికెట్లు ప్రేమ జనించును?

శేషమ్మ.—నేదాని నింతవఱ కెట్లుప్రేమించు చుంటి నో యదినీవ మెఱుఁగుదు. నాకూఁతుతో సమానముగఁ బ్రీతిసే యుచుంటిని. చిన్నప్పుడు నాప్రక్కనస పరుండఁ బెట్టికొను చుంటిని. ఇంటికేదైన మంచివస్తువు దెచ్చిన ముందుదాని

కిచ్చినఁగాని నాకుఁదృప్తి గల్గకుండెడిది. నేనెంత ప్రేమించు చుండినను అదిమాత్రము చిన్నప్పటినుండియు నాపై నసూయ గల్గియే యుండెడిది. నాకూఁతుతోడ ఎప్పుడును గలహించు చుండెడిది. చిన్నదనమగుటచేఁ దెలియక ఇట్లు చేయుచున్న దని కొంతకాల మూరకుంటినిగాని పెద్దదగు కొలఁదియు దాని దుండగ మతిశయించుచుండె. అత్తయన్న భయము బొత్తిగ లేకుండె. ఆఁడుబిడ్డ పేరెత్తిన నసూయ పడుచుండె. ఇదియంతయుఁ గనుచుండిన నాకు మాత్రము ప్రేమయెట్టు నిలిచి యుండునా?

లక్ష్మి.—కోడ లెంతమంచి దైనను అత్తయొక్క మెప్పు నడయుట గలలోని వార్త. సత్యవతిగుణ మెవ్వరికిఁ దెలియదు? ఆసాధ్వీమణి సీతతోసాటి యగునది. చిన్న దనమునుండి దానిగుణము మేమెఱుఁగమా? నీసుతవలె మోటు దనము గల్గియుండుట, దాసితగువుల నింటి దాఁకఁ దెచ్చికొ నుట యిట్టిదుర్గుణములు దానికి లేవు. వయసునఁ జిన్నదయినను దెలివితేటల మనకందఱి కంటెను మేటియయగు.

నరసమ్మ.—అడుగ మఱచితిని. నీబిడ్డ భర్తయింట సరిగాఁ గాఁపురము చేయుట లేదఁటఁగా!

శేషమ్మ.—నా కోడలివలె నది జిత్తులమారి కాదు. దానికి గబగబయని యఱచుట యొక్కటియే తెలి యును. నిష్కపట స్వభావ. తమ్ములమునసే యిట్టిచిక్కు లుదయించుచున్నవి. దానిభర్తయు నాకొడుకువలె సత్ప్రయో జకుఁడుగాఁడు, వాచాలకుఁడు.అట్టివానితోడ నెట్లుకాఁపురము పొసఁగఁ గలదు.

రంగమ్మ.—ఆహా! నీకూఁతు గుణము లెరెఱుఁగరు!

దానికాఁపురము సరిగా లేకపోవుటయే నీకోడలిపై నసూయకల్గుటకుఁ గారణమగుచున్నది. ఇట్లుండుట బాగుకాదు. నల్వురకు బుద్ధిచెప్పవలసిన దానవు. వృద్ధురాలవు. నీకిట్టిదుర్బుద్ధి తగదు.

నరసమ్మ.—నీ యీవర్తన మేమియు బాగుకాదు. నీవిఁక ఇంటికిఁబొమ్ము. సత్యవతిపై నేరములు చెప్పిన నీవసూయావంతురాలవని లోకులాడుదురు. కావున నీవింటికిఁ జని గుట్టుగానుండుము.

శేషమ్మయు బదులేమియు ననఁజాలక గృహమునకు వెళ్ళెను.



మూఁడవ ప్రకరణము.

# గయ్యాళి భార్య.



ఆంధ్రరాష్ట్రమున కలంకారభూత మగుచు, నాదినుండి జోస్యులకును గవివిద్వత్ప్రవరులకు నాకరమగుచు, మనుమసిద్ధి మున్నగు మహారాజులచేఁ బరిపాలిత మగుచు, సింహపుర మను నామాంతరమునఁ జెలంగుచు నెల్లూరు పుర మమరుచుండెను. ఈ మండలమున ధాన్యము విశేషముగా ఫలించుచున్నది. ఇది చోళ మండలము నానుకొనియుండుటచే దీనికి ద్రావిడభాషా సంసర్గముం జేసి నెల్లూరని పేరుగల్గెనని కొందఱభిప్రాయపడెదరు గాని యది విశ్వాసార్హముగాదు. రామాయణము రచించిన భాస్కరమంత్రి యీసీమ లోనివాఁడు? భారత నిర్మాతలగు నన్నె తిక్కన శంభుదాసాదులే మండలము

వాఁడు? కవిసార్వభౌముఁడగు శ్రీనాథుని తాతయును బద్మపురాణ కర్తయునగు కమల నాభామాత్యుఁ డేదేశపువాఁడు? రామాయణముం జెప్పిన మొల్ల యేప్రాంతము లోనిది? ఇట్టి యనుపమాన కవితా విలాసముంగాంచిన విదుషీ మణులచేతను విద్వద్బృందములచేతను గీర్తింగాంచిన నెల్లూరును "నెల్, ఊర్" అను నఱవమునకు జంటించి యఱవము సంసర్గము గల్గిన దనియు, నిచ్చటి కవుల దఱవ తెలుఁగనియుఁ జెప్ప సాహసించుట పొరబాటనియే విద్వాంసు లనేకు లెంచుచున్నారు. ఆ పురమున లక్ష్మి స్థిరకాఁపురముండును. సరస్వతియు నామెయెడ ద్వేషమును మాని యాబిడ కరస్పర్శంబున నమితానంద మందియుండును.

ఆ పట్టణమున రంగనాయకుల పేటయం దొక దేవాలయమున్నయది. అందు రంగనాయకు లున్నవారు. దేవాలయము వెనుకవైపున పినాకినీనది ప్రవహించు చున్నది. అద్దానికి నభిముఖుఁడై దేవుఁడు శయనించి యున్నవాఁడు. ఆపేటలోనివారెల్లరు నా దేవాలయమునుండియే యానదికిఁ బోవుచుందురు. అచ్చటనే స్నానపానములు సేయుచుందురు.

ఒకనాఁటి యుదయమున గొందఱాఁడువాండ్రానదికి వచ్చి స్నానాదు లాచరించుచుండిరి. అందొక్క వితంతువు స్నానమొనర్చి తాఁదెచ్చిన బిందియ నచ్చట మెట్లపై నునిచి చెంబులు తోమికొనుచుండెను. అట్టి సమయమున ఒక యువతి యచ్చటికివచ్చి నీటిలోదిగి వస్త్రము లుదుక నారంభించెను. వితంతువు నామెనుగని ;

"జానకమ్మా! నేనుస్నాన మొనరించి యుంటినని తెలియదా! బిందె యచ్చట నుంచియుండ నంత సమీపమున

చీర నుదుకకపోయిన కొంతదూరమున కేఁగ రాదా! దాన నీ ముల్లెయేమి మునిఁగిపోవును."

జానకమ్మ.—నరసమ్మా! విధవకు నీకంతనోరా! పదియో రెండుచుక్కలు పడినవఁట. అందులకై యింతపెద్ద నోరుచేసికొని తేఁచుకుక్కవలెపైన దుముకవచ్చుచున్నావు. నీకంటె నిచ్చఁ దగ్గనవారు ఎవ్వరునుగారనుట తెలిసికొనము. జాగ్రత్త. ఇంకొకసారి మాటలాడిన నోటికి బుద్ధిచెప్పి పంపుదున.

నరసమ్మ.—ఏమే! నాగుపాము విషమెక్కిన ట్లతిత్వరితముగా మించిమించి పోవుచున్నావు. మిన్నమీఁది పరుగు లెంతవఱకు నాగును! మేరదాటిన తలపగులునుగాదె. నీవిట్లు వదరుచుండిన నీయత్తతోఁ జెప్పి తగిన ప్రాయశ్చిత్తమొనర్తును.

జానకమ్మ.—అత్తతోఁ జెప్పిననేమి? భయమనుకొంటివే? మాయత్తకు రెండుకొమ్ములు మొలిచెనా! అత్తయు నొకయింటికోడలే యనుటను అచిరివా! ఈయత్తలు గిత్తలు వీరి మాటలు నాముందు సాగవు. తోఁక యాడించిన వెంటనే తెగఁ గొట్టుదును.

నరసమ్మ.—ఇట్లైన సభతోఁ జెప్పి దండింపఁ జేసెదను.

సుబ్బలక్ష్మమ్మ.—భర్తనుమాత్రె మది లక్ష్యము చేయునా! ఇట్టి గయ్యాళిముందర నెవ్వరు నిలిచి మాట్లాడఁ గలుగుదురు! గౌరవమున బుద్ధి నుడిచినవారలతో మాట్లాడ వచ్చునుగాని తెగించినవారలతో ఎవ్వరెదురుపలుకఁ గలరు?

జానకమ్మ.—ఓహో! నీప్రతాపము చూపనెంచితివా! మగని నొకమూలను ద్రోచి యింటింటఁ దిరిగివచ్చుచుండు నీ కింత నోరుండ వలసినదే.

సుబ్బలక్ష్మమ్మ.—ఓసీ! నేనును నరసమ్మవలె బేలనని యెంచితివే! గట్టిగమాటలాడిన నవమతి పొందఁగలవు.

జానకమ్మ.—నీ సాహస మింతకుమున్నే చెప్పియుంటి నిగా! అట్లుండ నిన్ను నరసమ్మతో సాటియని యెట్లందు? నేన మాన మొందుటకు నొక్కొక్కని యింట దూఱుటలేను.

సుబ్బలక్ష్మమ్మ.—ఇంకొక తూఱి యిట్లుమాటలాడిన గౌరవము దక్కదుసుమీ. నీవలెభర్తను సరకుసేయక తిరుగు చుండు దాననుగాను. తానుదొంగయైన, ఊరంతయునట్లే యుండునని యెంచుట సహజము.

జానకమ్మ.—ఏమి! అప్పటప్పటికి మాటలు మీఱు చున్నది! ఈతూఱి నోరు తెఱచిన నీనోటి పండ్లూడఁగొట్టెదను.

సుబ్బలక్ష్మమ్మ.—ఏది! రమ్ము. ఊడఁగొట్టెదవో, ఊడఁగొట్టించుకొనెదవో చూతము.

అనియిట్లులామె యాడినంతనె జానకమ్మయునామెతోఁ గలియఁబడ నుద్దేశించి తనపైటచెఱఁగును నడుమునకుఁజుట్టి కొనియె సుబ్బలక్ష్మమ్మయు వచ్చుదానితోఁగలియఁబడుటకుఁ దానును సంసిద్ధయై యుండె. అట్టియెడ నచ్చటనుండువారు కొందఱాజగడము నాఁపుటకుఁ బ్రయత్నించిరి. వీరెంతనిలుపు చుండినను వీరిరువురునుజగడమునకువలయు సన్నాహములుచేసి కొనుచుండిరి. నోటిమాటలతో నారంభ మయిన కలహము చేతులు కలియు నంతవఱకును వచ్చెను. ఇంతలోన సావిత్రి యడ్డమువచ్చి వారు కలియఁబడ కుండులాగున నాఁపఁజొచ్చె ను. 'జంబుకోమేష యుద్ధేన' యనునట్లు వారిరువురును ఈమెను బ్రహరించిరి. అంత నచ్చటనుండు నాఁడువాండ్రను పెక్కురుజేరి వారి తగువును దిన్నఁగ నాఁపుచుండిరి.

సుబ్బలక్ష్మమ్మ మాత్రము వెనుకఁ బడెను. ఈమె తగ్గుఁగొలఁదియు జానకమ్మ మిక్కుటముగ విజృంభించుచుండె. వారెల్లరామెనతిప్రయాసముపై వెనుకకు మరలించి యామెయింటికిఁ గొనివచ్చి దిగవిడచిరి. ఈమెమాత్రి మధ్యము వచ్చిన వారిని సుబ్బలక్ష్మమ్మనుగూడ నోరికి వచ్చినట్లు తిట్టుచుండెను. విశ్వనాథము నింటికి గాఁగనే భార్యచేసిన యాయుదంతమెల్లఁదెలిసి విషణ్ణచిత్తుఁ డాయెను. తనకవచముఁదీసి చిలుకకొయ్యకుఁ దవిలించె. చేతినుండు నాసనమున నాసీనుఁడై;

"ఆహా! దీనినెట్లు సరియగుదారిం దిప్పికొనుట! మంచి మాటలాడిన వినకుండె. భూషణ దానాదులకు లోఁబడకుండె. బెదరించిన లాభములేకుం..కొట్టిన నాఘాయిత్య మతిశయించుచుండె. విసర్జింతిమన్న; దీనిఁజూడకున్నను, గౌరవార్హుఁడగు దీనియన్నంజూచి యూరకుండవలసె. దీని దుశ్చర్యలా అప్పటప్పటి కతిశయించుచున్నవి! వీథిరచ్చ లింటిలోనికిఁ దెచ్చుచున్నది. ఇంటింటికిఁ బోయి నాపైనను నాతల్లిపైనను గొండెములం జెప్పుచున్నది. మిత్రులతో మాటలాడుచుండునపు డచ్చటికి వచ్చి నను రచ్చ కీడ్చుచున్నది. ఈకష్టము నాకెట్లు తొలఁగునో తెలియకున్నది?

భార్య వశవర్తినిగా యుండుటయుఁ గొప్పయదృష్టములలో నొక్కటియని తప్పక చెప్పనగును. అట్టి పత్నియ కష్టములనెల్లఁ బోఁగొట్టునదగు. ఇంక ప్రతికూల దారుని గతి సెప్పనేల? అట్టి వానికి వేఱునరక మక్కఱలేదు. వాని మనుగడ భూభారమునొఱకే యగు. వాని యౌవనమడవిని గాచిన వెన్నెలయనుట కావంతయేని లోటులేదు. అనుకూల భార్యగలవాని బ్రదుకొక్క నాఁటిదియైనఁజాలును. ఇన్ని సంకట

ములకును గారణము నా జననియొక్క వరదక్షిణాభిలాషయ కాదె?

ఔరా! నాగరక మతిశయించుచుండు నిక్కాలమునను వరదక్షిణాది దుష్కార్యము లడుగంటకుండెనుగా! అవి యెట్లు నశింపఁగలవు? నాయట్టివారలును బూర్వాచారపరాయణులగునట్టి తల్లులమాట జవదాటఁగూడదని యెంచి యిట్టి యకార్యముల కష్టపడకున్నారు. ఇంతకును నావ్రాఁత యిట్లుండ దానిందవ్వుట కెట్లు సాధ్యమగును? పూర్వజన్మకృతమగు పాపకర్మమనుభవింపక తీరునా?"

అని యిట్లు చింతింపుచుండ వీధినొక రచ్చవినఁబడియె. విశ్వనాథశర్మయు నద్దానిఁగాంచ వాకిటి కరుదెంచె. అప్పుడు సుబ్రహ్మణ్యముగారొక దుష్టకట్టుపుచ్చుకొని యచ్చటి కరుదెంచిరి. వారితోడ వారి బావయగు నీలకంఠమును వచ్చియుండిరి. వారిద్దఱు నతనిం జూచినంత విధేయులై నమస్కృతులఁ గావించిరి. విశ్వనాథమును వారిం జూచి;

విశ్వ.—సుబ్రహ్మణ్యము గారూ! ఏమిటి యీయాడంబరములు!

సుబ్రహ్మణ్య.—అయ్యా మీభార్య యదృష్టము బాగుండుటచేతనే మీరు గాన్పించితిరి. మిమ్ముఁజూచి నంతన నాకోపము శమించుటయకాక భక్తిభావమును గుదిరెను.

విశ్వ.—మీరిట్లాడుటకుఁ గారణమేమియో నాకు గోచరింపలేదు.

సుబ్రహ్మణ్య.—ఈ దినము నదికి స్నానమున కరిగిన మీ భార్యకును నాభార్యకును వాగ్వాదము జరిగెనఁట. అది మాటలతోఁ బ్రారంభమయి చేతులతోఁగలియఁబడువఱకు

నయ్యెనఁట. అట్టి తరుణమునఁ బ్రక్కనుండువారణఁచి వేయుటచే నా భార్య యించుక వెనుదీసెనఁట. అది యే యదనని భావించి మీ భార్య దానిం జావమోఁది నోటికి వచ్చినట్లెల్లం దిట్టెనఁట. నేనింటికి వచ్చునప్పటి కీవిషయ మెఱుకపడియె. అయ్యాగ్రహమునఁ బొద్దుననలేచినది మొదలు మాకెల్లరికిం బలువిధములుగ సాయపడు మిమ్ము మఱచి యీదుష్టకత్తెతో నామెం బాద నే తెంచితిని. ఇంతలోనఁ దమదర్శనమగుటచే నాయాగ్రహ మించుక యుపశమించెను. అంత నేనట్టి సాహసము నాచరిం పఁజాలక తమతో విన్నవించికొంటి, తామామెకు బుద్ధిచెప్పి ఇంక నెప్పుడు నిట్టి యకార్యము లాచరించ కుండులాగునఁ జేయవలయు. క్రోధమున నేనిట్లు వచ్చినందులకు నన్ను క్షమిం చవలయును. అని యాతఁడు తన యింటి కేఁగెను.

పిదప విశ్వనాథమును గోపముతోడ నింటిలోనికి వచ్చెను. అట భార్యం గాంచి;

విశ్వ.—ఓసీ! ఎన్నిదినములు నీయీగాపట్యమే నోర్చికొని యుండువాఁడను! ఎల్లప్పుడు నూఁ జగడ మింటిలోనికిం దెచ్చుటయే నీపని యగుచున్నది. ఇట్టినీమరాలవు నీవు జీవించి యుండుట కన్నను జచ్చుటయే మేలగును. సుబ్బలక్ష్మమ్మనేల కొట్టితివి? ఆమెభర్త వాకిటికి వచ్చి నన్నుగదా దూషించి పోయెను!

అని యింకేమియో చెప్పఁబోవుచుండ నింతలోన జ్ఞానకమ్మయు ముఖ మింకొకవైపునకుం ద్రిప్పికొని పెదవి విఱిచి వానిని బరిహాసించి;

జ్ఞానకమ్మ.—మెడముట్టి త్రాడుగట్టినది మొదలొకనగ చేయించుటకైనను ద్రోవలేనివారు నేఁడు ఇంత విజృంభించ

నేల? ఇట్టివానికి నోరొక్కటి యా? వేళకంత యన్నము వేసినఁ గుక్కవలె గతికి పోవుటకు మాకు జోలి మాలిన పనిలో నేల జోక్యము గల్గించి కొనవలయు? సరిగా జరుపుటకు సాధ్యమయి ననకదా యట్లుపదేశింపవలయును! సుబ్రహ్మణ్యము వచ్చి దూషించిన వానిభార్య చేసినపని సరిమాయని యనుగుటకు నోరు లేకపోయెనా? అట్టివారి కిప్పుడు నన్ను దూషించుటకు మాత్రము నోరింత యెక్కుడుగాఁ గల్గెఁ గాఁబోలు! చాలుచాలు నీపెద్దతిక మీకఁ గట్టిపెట్టి మీపని చూచికొనుఁడు.

ఈమాట లాలకించి సంతన ఆతని కాగ్రహ మతిశయించెను. కన్నులెఱ్ఱ వారెను. అంతకంత కధికమగు నాగ్రహ మాపికొనఁ జాలక యామెం జేతితో నొక్క దెబ్బవైచెను. పడినదెబ్బ యంత గొప్పది గాకున్నను అది యామె చిత్తమును గలఁచి వైచెను. ఆవల నాబిడ;

"అయ్యో! అశరణ నగునన్నిట్లు చానమోదు చుండఁ గాచు వారెవ్వరును లేరా! తల్లీ! చిన్నప్పటి నుండియు నన్నెంత గారవముతోఁ బెనిచి యుంటివి. తుదకుఁ గసాయి వానిచేతికి మేఁకనిచ్చినట్లే నీచునకు కటికవాని కీనిర్భాగ్యునకిచ్చి కట్టిపెట్టితివి కాదే! నీవిప్పుడు చూచినఁ బ్రాణములు విడుతువుగదా! ఓరీ! దుర్మార్గా! అత్తమీఁదికోపము నత్తమీఁదఁ జూపినట్లావిధమ సుబ్రహ్మణ్యముగాని పైనికోపము నాపైఁ జూపి నన్నిట్లు హింసించితివి గదరా! అమ్మా! ఎట్టిదెబ్బదగిలి ఎంత నొప్పి యెత్తుచున్నది! ఓరీ! రాక్షసా! కులకాంత నిట్లుకొట్టిన నీచేతులు పుచ్చవా! నీవెంత మగఁడైనను ఇట్లా కొట్టుట! నీతల్లివలె నాతల్లియుఁ బదినెలలు మోచి కనలేదా! నీయట్టి

పిశాచముతోఁ గాఁపురము సేయుటకన్నను బావిలోఁ దూఁకి చచ్చుటమేలు. చచ్చిన పీడవదలెనని యెంచెదవు కాఁబోలు! నేను మరణించియు దయ్యమై నిన్నుఁబట్టి బాధింపకమానను. ఛీ! ఛీ! నీముఖమింకఁ జూడను. ఇదె నాప్రాణములఁ బోఁగొట్టికొందును."

అని యాడుచు నాగ్రహమున నచ్చటినుండి కదలి దొడ్డినుండు బావి వైపునకుఁ జనె. కోపమునం బడవలెనని యాగ్రహమున నెడలుచుండు నీనుకాలి కొకచిన్న ఱాయి దవిలె. వెంటనే నూతియొక్క వేగ మించుక మానెను. 'చచ్చిన లాభమేమి! బ్రదికియుండిన నింక నెన్నియో విధముల నాకసి దీర పీడ బాధింపవచ్చును.' అని యెంచి మరలివచ్చినది. వచ్చిన యామె యేకాంతికిని గాన్పింపక, తిన్నఁగ నొక గదిలోనికిఁ బోయి నేలపైం గూర్చుండెను. అటఁగట్టిలు వైచి యుండెను. ఆ మువెలుఁ గావంతియును లేకుండె.

విశ్వనాథము తల్లి రంగనాయికమ్మయుఁ గోడలు బావిలోఁ దూఁకెద నని యేడ్చుచుఁ బోవుచుండుట గాంచి కుమారుని చూచి;

రంగనాయిక.—తండ్రీ! ఆగయ్యాళి నేల కొట్టితివి? అది బావిలోఁ దూఁకుదునని పోవుచున్నదే! ఇంక నేమిచేయుదువు? ఆ మొండిది యెవ్వరడ్డపడినను నిలుచునది కాదె!

విశ్వ.—తల్లీ! నీకేల యింతటి యారాటము? అది బావిలో దూఁకుననియా తలఁచెదవు? మనబోటివారల నూగ్గరఁ ద్రోయును. అది దుముకుట వట్టికల్ల.

రంగనాయిక.—కోపము చెడ్డది. క్రుద్ధులగు వారు

కార్యాకార్యముల విచారింపరనుట నీకుఁ దెలియదా? ముందుముందుఁ బోయి దాని యాసాహసకృత్యమును మాన్పి పిలిచికొనిరమ్ము.

విశ్వనాథ మెట్టితిరుణమునను దల్లిమాటలఁ దిరస్కరించువాఁడుగాఁడు. కాఁబట్టి భార్యను సాంత్వవచనముల సరి పలుపనెంచి దొడ్డిలోని బావియొద్ద కరిగెను. అట బావిలో దూఁకిన చిహ్నము లెవ్వియుం గాన్పింపలేదు. కాలిజాడలు నింటిలోనికివచ్చినట్లు గన్పట్టుచుండె. అంత నింటిలోనికివచ్చి తల్లికీ విషయమెఱుకపఱచెను. ఆమెయు నింటం గలయ వెదకెను గాని కట్టెలు వైచియుండు నాచీఁకటిగదిని మాత్రము వెదుకలేదు. తాను వెదకిన స్థలములనెల్ల నాబిడ గన్పట్టకుండమి బావిలో దూఁకెననుట నిర్ధారణచేసికొనియెను. ఇంక నఘకారణమ్ముచేఁ గుమారున కెట్టిసంకటములు గల్గునోయని యెంచి చింతించెను. దయ్యమై యాతనిఁబట్టి యెచ్చట బాధించునోయని తలఁచి భయమందెను. అంత నా చీఁకటిగదిలోని కరిగెను. అందచ్చటచ్చట వెదకుచుండఁ గాలికెద్దియో మెత్తనొక్కటి తాఁకినట్లు దోఁచఁగ భయమందెను. జానకమ్మ దయ్యమై తమ్ము బాధింపవచ్చి యున్నదని యెంచెను. అంత "అయ్యో! దయ్యము దయ్యము" అని యఱచెను. విశ్వనాథమును దీపముం దెచ్చెను. దానివెలుఁగున భార్య యటనుండుట గనుఁగొనెను. రంగనాయకమ్మయుఁ గోడలి నెన్నియోవిధముల సాంత్వవచనములచే నపగతక్రోధం గావింప నెంచెను. అవియెల్ల భస్మమునఁబోసిన యాజ్యము భాతినయ్యె, ఆసమయమున వాకిట నొకగుఱ్ఱమబండి వచ్చినిలచెను. అందుండి యొక యువకుఁడు దిగెను. వాఁడా యింటిలోనం బ్రవేశిం

చెను. వాని జూచినంతన విశ్వనాథమును దెల్లపోయెను. వచ్చిన యాతఁడును "బావా! నాతల్లికి శరీరమించుక జబ్బు చేసియున్నందున నాసోదరినిఁజూడ నెంచియున్నది. ఆమె యానతి చేతనే యిచ్చటి కరుదెంచితిని. మీరాజ్ఞ యిచ్చిననీమెను బిలిచి కొని పోయెద" ననెను. విశ్వనాథము నట్లేయనెను. ఆతని భోజనమునకై పిలిచెను. ఆగంతకుఁడును దాఁ దన మామ గారియింట భుజించినట్లాడెను. సోదరిఁబిలిచికొని వెళ్లెను. జానకమ్మకును అన్నవలని భయము మెండగుటచే నేమియు బదులాడక యాతనివెంట నేఁగెను. విశ్వనాథమును రంగనా యకమ్మయును ఆగయ్యాళి యిలువెడలి పోయినందుల కెంతయు సంతసించిరి.



నాల్గవ ప్రకరణము.

## అసూయాభివృద్ధి.



వదినా! నాకవెల్లఁ దెలియదని మీయభిప్రాయము! నీవంటి వారి కెందరికైనను జెప్పునంతటి సామర్థ్యము నాకుఁ గలదు. ఇంతకు నాఁడు పెద్దలమాట వినినఁ బుట్టలోని పాములాగున నణఁగియుండ వలసినదానవు నీవు నాకుఁ నీతులునేర్ప వచ్చెదవుగా!

వదిన.—నేనాడిన మాటలకు నీవన్యథాభిప్రాయముఁ జెందనేల? ఇందేమి తప్పుగలదు? శాస్త్రము లిల్లుభర్తయే పరదైవమని చెప్పుచున్న వంటిదిగాని వేఱేమి చెప్పితిని?

ఆఁడుబిడ్డ.—నాకుఁ జదువు రాదనియు, నీకు విద్య వచ్చుననియు గర్వమునఁగదా యిట్లుపలుకు చున్నదానవు! లేకున్న నాశాస్త్రమున నట్లుచెప్పి యున్నది! ఈశాస్త్రమున నిట్లుసెప్పి యున్నద'యని వచియింతువా! ఎంతవిద్య కల్గిన నేమియుపయోగము? దుష్టురాలగు నీ సహవాసమయుక్తము.

"గీ॥ విద్యచే భూషితుండయి వెలయు చున్నఁ
దోడరి వర్జింపఁ దగుసుమీ దుర్జనుండు
చారుమాణిక్య భూషిత శస్తమస్త
కంబయిన పన్నగము భయంకరముగాదె?"

అనుట నీకుఁ దెలియదే?

వదిన. — విద్యా గంధము లేదని నీవువచియించి యుంటివే! అట్టినీ కీపద్యము మాత్రమెట్లు దెలిసెను?

ఆఁడు.—నంద్యాల రామచంద్ర శాస్త్రిగారు రప్పు డప్పుడు చెప్పుచుండ నాబాల్యమున విని యున్నదానను.

వదిన.—ఔను. వారికిది తగినపద్యమే యగును.

ఆఁడు.—అయిన నాకెందుఁగూడ దుష్టుఁడనియే నీ యభిప్రాయము గాఁబోలు ?

వదిన.—వారివారి గుణములు వారివారికి విశదమగు నవియే కదా ?

ఆఁడు.—ఏమి నీగర్వము ? నీనింద కెంతటి గొప్ప వారును బాల్పడుచున్నవారు గా ?

వదిన.—ఇది నిందయెట్లగును? కలిగినది సెప్పియుం టినిగాని వేఱుకాదు.

ఆఁడు.—నీవింత మించిపోవుటకు మాయన్నయొక్క వివేక రాహిత్యము కారణమగుచున్నది.

అని యిట్లిర్వురంగనలొకయింట మాటలాడుచుండ నొక్కపురుషుఁడా ప్రదేశమున కరుదెంచెను. వానిఁ జూడఁగనే యాయువతులలోఁ గొంచెము పెద్దదిలేచి నిలువఁబడెను. ఆ ఇంతులతో నాపురుషుఁ డిట్లనియె.

పురు.—ఆహా! మీజగడములు దినదినమభివృద్ధిఁ జెందుచున్నవి కాని తగ్గుటలేదుకదా!

పెద్ద.—నాథా! నేను బతిసేవనుగుఱించి యెంతయో వచించుచున్నాను. నామాటలనిది బాల్యమునలక్ష్యపెట్టకున్నది.

పురు.—అమ్మాయీ! మీవదినె సెప్పినదెల్ల వాస్తవము. నీవును ఆపద్ధతుల ననుసరించిన క్షేమమఁ పడఁగలవు. ఆమె యుపదేశమింకను నీమదికెక్కలేదు కాఁబోలును.

చిన్న.—అన్నా! నామదికెక్కినను ఎక్కకపోయినను ఈమె దుర్బోధనయను విషము నీతలకెక్కి మొదటిని గలఁతఁ బెట్టుచున్నది. ఇట్లే కొంతికాలముండిన నీమె చరణదాసుఁడవై, నీయుద్యోగమునకుఁ గూడ నీళ్లువదలవలసి వచ్చును. నిక్కముగ నీ కిది మందుపెట్టియుండును గాని యన్యము కాదు. వదినా! ఇన్ని శ్రీరంగ నీతులు పలుకుటకంటె, నామందేదియో సెలవిచ్చిన నాకాఁపురము గుఱివడఁగలదు.

పురు.— అమ్మాయీ! మందులుగిందులని మోసపోయి మొదటికే లోటు దెచ్చుకొనకుము.

"చ॥ మగువయొనర్చు వశ్యవిధి మందులు మాయలునొంగు చందమై। మగనికిఁ దెచ్చురోగములు, మానక
మూకజడాది భావముల్। మొగినొనరించు నద్దురి
తముల్ దనచేసిన చేఁతలైతుదిఁ। జగమునకెక్కి
నిందయును సద్గతిహానియు వచ్చునింతకుఁ॥

క॥ కావునఁ బతులకు నెప్పుడు।
గావింపందగదు కపటకర్మంబులు ద।
ద్భావము జెందిగి వశవర్తిని।
యై వంచించరింపనదియ యగునెల్ల వియర్ ॥"

చిన్న.—అన్నా! ఆమాటలట్లు గట్టిపెట్టుము. నీకావంతయు లోకానుభవము లేనందున నీవిట్లు పలికెదవు.-వదినా! ఆతని మాటలకేమిగాని నాకు మంచిమందు నొక్కదానినిఁ దెల్పుము.

వదిన.—ఇందులకు మందులుమాయలు బనిలేవు. నేఁజెప్పెడి రీతిని నడచికొనిన నదియ చాలును.

ఆఁడు.—మందులు లేకున్నమానెఁగాని నీవెట్లు వశపఱచుకొంటివో సెలవిచ్చిన నేను నయ్యుపాయముచొప్పునఁ జేయఁగలదాన.

వదిన.—ఆయుపాయములఁ జెప్పెద వినుము.

"ఉ॥ ఆ త్తికుభక్తిఁ గల్గి మదినాయము చెప్పినమాడ్కిఁ జేటికా।
వృత్తిము లాచరించుచు గురువిప్రసురాతిథి పూజనంబుల।
త్యుత్తమభక్తి నేనతిగనోపియొనర్తుఁ బ్రియంబుఁ జాల్మియర్। పత్తిపనంబు సందియము మేలుఁగదాల్తు సమస్తభంగులర్ ॥''

కావున నీవు సమార్గమునసే నడచిన నీభర్త నీకు వశవర్తియగు

ఆఁడు.—చాలు చాలునీ ప్రగల్భములు. ఇఁక వానినెల్లఁ గట్టిపెట్టుము. ఇట్టినీమాయ మాటలకేనును మాయన్నవలె లోఁబడుదునని యెంచితివా? అట్లుతలఁపకుము.

వదిన.—నామాటల నన్యథా భావింపకుము. నేఁజెప్పిన

డెల్లవాస్తవము. నాయనుభవమునఁ దెలిసికొన్న దానినే నీకుఁ దెలిపి యుంటిని గాని వేఱుగాదు.

పురు.—సోదరీ! దానిమాట లాదరమున వినియును మోదింపుము. దైవమెల్లఁ దోఁచుఁగాఁ గలదు. భర్తకు మించిన దైవము లేదని భావమునఁ దలఁచుట భామలకు ధావ్యము. అత్తగారికి తత్తఱని జిత్తము నొవకుండు లాగున మెలఁగుట యుత్తమాంగనకుఁ గర్తవ్యము.

జానకి.—అన్నా! నీవివన్నెలాడి మాయలకుఁజిక్కి యన్నిటుఁ జులకనగాఁ జూచుచున్నావు. ఇది సరిగాదు.

పురు.—నామాటల నలక్ష్యము సేయుచున్న దానవు. ఇయ్యది నీమేలునకో కీడునకో నె నెఱుఁగఁజాలను. స్త్రీలకు భర్తలిండ్ల దాసీవృత్తి నున్నను గౌరవావహ మగునుగాని, పుట్టినింట నెంత గౌరవమునఁ దులఁ దూఁగినను బాగుండదు.

వదిన.—అమ్మాయిగా! మీయన్నగారామనసదంత యు వాస్తవము. వారిమాటల చొప్పున నడచికొనుము. నీకన్ని శుభములును గలుగఁ గలవు.

జానకి.—ఆహా! ఎంతటిటక్కులాడివే! అపవాదము వానిపైఁబడి పోవనిమ్మని లోలోన నగనిట్లెంచెప్పి యీలాగున నడిపించి పైకేమియు నెఱుఁగనిదని శోధించుట కిట్టి మాటలాడుచున్న దానవుగా! నాతండ్రిసొమ్ము నేననుదిను చున్నానుగాని నీజనకుని సొత్తేమియుఁ దెచ్చిపెట్టుటలేదు.

వదిన.—నిక్కముగ నేనట్టి యభిప్రాయముగల దాన నుగాను. నాపైనూరక యపవాదము వేయ నేల?

పురు.—అమ్మాయీ! నీకింకను దుర్బుద్ధి మానకున్నది. మనమిట మాటలాడుచుండ నెచ్చటనో నివసించి యుండు

నామామగారి పేరెత్తుట సరియగునే! ఇదివారికిఁ దెలిసిన నేమని యెంచుదురు?

జానకి.—నీమామ గారు గొప్ప యుద్యోగస్థులైన, వారిచ్చు కట్నములు, కానుకలు, నీవు తీసికొనుటచే భయ పడవలయును; లేదా నీభార్య యెచటఁ గోపించునో యనినైన భయపడ వలయును; నేనేలఁ జడియుదును?

పురు.—మూర్ఖురాలా! నీకుపదేశించుట కంటె నొక ఱాతి యొద్ద మొఱఁబెట్టికొన వచ్చును.

సత్య.—అమ్మా! జానకీ! నామాటల వినుము. వారును నీమేలునకైకదా చెప్పుచున్నారు! అట్లుండఁగ వారితో వాదులాడు టేల?

జానకి.—మాయన్నయు నేనును ఎటులైన వాదులాడు కొందుము. మాజోలి నీకేల? నిన్నెవరు నిచ్చట తగవు దీర్పుమని ప్రార్థింప లేదు.

పురు.—కాంతా! తోడఁబుట్టిన దోషమున కీజడముచే మాటల నేఁ బడవలయునుగాని నీవేల పడవలయును?

జానకి. — నీభార్య యంత మేధావినియు నేనంత జడమును నైతినా! రెండు ముక్కలు చదువఁగనే వివేకవతి యయ్యెనని యెంచితివే? విద్యావంతు లెందఱు లౌకిక జ్ఞాన శూన్యులై పరమానందయ్యగారి ప్రధాన శిష్యులై యుండ లేదు. చదువునకునుఁ దెలివికిని మిక్కిలి యంతరము గలదు. చిన్నప్పుడే చదువు చెప్పింపనితోడఁబుట్టువు నీవుక దాజమఁడవు?

వీరిటు మాటలాడికొను చుండగా శేషమ్మ యచ్చటి కరుదెంచి;

శేషమ్మ.—బిడ్డా! ఏలనీవిట్లు ఆగ్రహపడి మాటలాడు చున్నదానవు?

జానకి.—జననీ! నీకోడలు తనమగనిచే నన్నుఁ దిట్టించుచున్నది. నన్నింటినుండి వెడలఁగొట్టుమని నాయన్నకుఁ జక్కఁగ బోధనచేసి యున్నది. నను బరిహసించు చున్నది. అమ్మా! దీనికి గర్వమతిశయించినది. దీనినూరక విడువరాదు.

శేషమ్మ.—సత్యవతీ! నీవిట్లు దుష్పథమున నే ప్రవర్తించు చుండిన నిను శిక్షింప వలసివచ్చును. పిమ్మటఁ జింతించిన లాభముండదు. భర్త యనుకూలముగ నున్నవాఁడు గదాయని యెంతువుగాఁబోలును! పాప మొకపడతుక కాఁపురమునకుఁ జెడుగు గల్పింపనేలయని యూరకున్న సరిపోయెఁ గాని వలయునన్న నొక్కనిముసములో నీముఖము చూడకుండు లాగునఁ జేయఁగలను. ఎప్పటికిని నాకుమారుఁడు నామాటమీఱి నడచువాఁడు గాఁడు. జాగ్రత్త!

సత్య.—మీమాటల కే నెన్నడును ఎదురాడుదాననుగాను. పరదైవమగు పతిని గని యిచ్చిన పరమోపకారిణుల పట్లఁ బాపము దలఁపఁ బాడిగాదని నే నెఱుఁగుదును. వారిచిత్త మెత్తఱిని మెత్తఁగ నుండు నటుల మెలఁగుట మెలఁతల కుత్తమ ధర్మము.

శేష.—ఏమి! నీవిద్యా ప్రౌఢిమయంతయు నాయొద్ద వెల్లడి పఱుప వలయుననియా నీయభిప్రాయము!

జానకి.—అమ్మా! దీని కాగర్వము పూర్ణముగ నున్నది. ఇంతకుమున్న నాయొద్దఁ గూడఁ దనపాండిత్యప్రభావమును బ్రకటింప నెంచియే వే వోబడాయీలు గొట్టుచుండెను.

శేష.—ఓసీ! నీపొగరు నీచూపులలోననే తెలియు చున్నది. నీకావర మణఁచెదనులే!

వేంకటేశ్వర.—మాతా! తెలివిలేనిదాని పలుకులు విని నీ విట్లాతురపడుట బాగుగాదు. ఏదియును ఆలోచింపక మాటలాడుట తగదు.

జానకి.—ఏమి! భార్యమాటలను విని రానురాను మీఱిపోవు చున్నావే! పూజ్యురాలగు తల్లినే యిట్లు మాట లాడనేరని దని నిందించుటకుఁ బ్రారంభించితివిగా!

వేంకటేశ్వర.—అమ్మగారిని నే నట్లనుటలేదు గాని మాటలాడనేరని నిన్ను నే ననుచున్నవాఁడను.

జానకి.—మాటలాడఁ దెలియకున్న నష్టములేదు. నీభార్యవలె గర్వము లేకున్న నంతియ చాలును.

వేంకటేశ్వర.—మాట నేరమినింగల లాభమును, మాటలాడ రామినింగల నష్టమును నీకుఁ దెలియనందున నట్లాడుచున్నావు.

జానకి.—నాకు మాటలు రానందున నీకేమియు నష్టములేదు. పెండ్లము నదల్పసామర్థ్యము చాలనివాఁడవు నన్ను బెదరింప వచ్చెదవా?

సత్యి.—పెద్దవారను గౌరవము నెంచక నీ వీలు వారిని దూలనాడుట సరికాదు.

జానకి.—మాజగడమున కడ్డము రావలదని నీ కిం తకుమున్నే వచియించి యుంటిని గదా? ఏల మఱలఁజొచ్చెదవు!

వేంకటేశ్వర.—అమ్మాయీ! ఇందుఁ దెలివితక్కువ నీదికాని దానిదికాదు.

శేష.—ఓసీ! నీ కేలదానిపై నంతటి యభిమానము?

దానిమాటలకు మోసపోయి యమాయికురాలగు నీసోదరిని దూషించుట యుక్తమా!

వేంకటేశ్వర.—నీవాడు మాట నీకుఁదక్క నోరులకు నచ్చఁజాలదు. బుద్ధిహీనురాలగు కూఁతును దండింపఁ జాలక యిట్లు కోడలిపైఁబడుట పాడియగునే !

శేష.—ఆహా! ఆలిని వైవేసికొని యీలాగునఁ దల్లిని దిరస్కరింప మొదలు పెట్టితివా? అయిన నీకుఁ గాఁపురము గుదిరిన ట్లే?

వేంకటేశ్వర.—అమ్మా! నీకోడలు నీకేమి యపకారము గావించెనని దానిపై నసూయ నందుచున్నావు? గొప్ప వారగు మా మామగారీమాట విన్న మనపైఁ గోపము చెందుదురు గదా?

శేష.—నీ మామగారి యింటిగుట్టెచ్చట నెవ్వ రెఱుఁగరు? పసివాఁడ వగుట నీకు వారి సందర్భములు దెలి యవు. నేఁజెప్పెద వినుము. వారితండ్రి రామబ్రహ్మముగారు నీతండ్రిగారు పసివారుగానున్నపుడు దామీయింటి వ్యాపారము లనెల్లఁ జూచుకొనుచు, ఇచ్చటి సొమ్ములనెల్ల నపహరించి, ఆ ద్రవ్యముచేఁ దనకుమారునకుఁ జదువు చెప్పించెను. ఇంత చేసినను మీతండ్రిగారికి వారిపైఁ బితృప్రీతి వీడకుండెను. మా మామగారు ; రామబ్రహ్మముగారు బిచ్చమెత్తు కొని కష్టపడుచుండఁ గనికరమునఁ గాపాడిరఁట. వివాహము మొదలగునవి చేయించి జీవనమునకుగాఁ గొంతధన మొసఁగి రఁట. తమమరణ సమయమున మాతృహీనులైె పసివారగు మీతండ్రిగారిని వారికప్పగింతపెట్టి, పరామరికతోఁ జూచు కొనుమని యందుకొఱకుఁ గొంత ద్రవ్య సహాయముచేసిరఁట.

ఒక్కపూటకునుగూటికి లేక తిరిప మెత్తుకొని బ్రదుకువారికి గొప్ప సహాయము సేసినందుల కానెనరు సుంతైనను లేక మన ద్రవ్య మెల్ల నపహరించిరి. ఇప్పటికిని వారియింటఁగల కొన్ని వెండిపళ్లెరములపై మీతాతగారి పేరున్నది. నేను నావిషయమై మా వియ్యంకురాలిని బ్రశ్నింప "నిదిమామామగారికి మీ మామగా రిచ్చిరఁట."యని బదులు సెప్పెను. తండ్రికంటెఁ బది మడుఁగులు దుష్టుఁడు మీమామ. అట్టివాని కూఁతు రెట్టిదగునో నీవే యాలోచింపుము. వారిసందర్భమెల్లఁ దెలిసినపిదప వారియెడ మన మెట్టి గౌరవ ముంప నలయునో యాలోచింపుము.

వేంకటేశ్వర.-తల్లీ! రామబ్రహ్మముగారు మనద్రవ్యమపహ రించినమాటయెల్ల, వారు వీరుననుకొను మాట లేకాని మనము చూచి యెఱుఁగముగదా. లోకులమాటలవిని యొక్కరిపైఁ దప్పులు మోపుట యుక్తముగాదు. వారొక వేళ మనద్రవ్య మపహరించి యుండినను మాతండ్రిగారికి వారిపై సదభి ప్రాయ ముండుటచే నీకును వారు పూజ్యులే యగుదురు. మఱియు వారికి నాపై నెంతయో ప్రియ ముండెడిది. మా మామగారియింటికిఁ బోయినపు డెల్ల వారు నన్నెంతయో గౌరవ మునఁ జూచుచుండెడివారు. అట్టివారిని దూషించుట పాడి గాదు. నల్గురు విన్నను నవ్విపోవుదురు.

శేషమ్మ.—తల్లియను గౌరవ మానంతయును లేక నోరి కొలఁదినదరు చున్నాఁడవు. ఇదినీకు క్షేమావహము గాదు. నాకతివిధేయుఁడవగు నిన్నిట్లు దుర్గుణముల పాలు గావించిన దీనూయలాడియే యని నేనెఱుఁగుదు. ఇంక

దీనికిఁ గష్టములఁ గల్పింపకున్న సరికాదు. ఈనీచురాలి మూలమున నీవెంతయుఁ జెడిపోవు చున్నాఁడవు.

అంత వేంకటేశ్వరుఁడును "ఈమె నన్యవిషయము లలోఁ ద్రిప్పకున్నఁ గోప మప్పటప్పటికతిశయించు" ననియెంచి;

వేంకటేశ్వర.—అమ్మా! ఇంకనీవీ విచారమును మాని ప్రకృతము నారయ వలయును.

శేషమ్మ.—ఏమిటి యాప్రకృతము?

వేంకటేశ్వర.—మన జానకి కాఁపురము కుదురువడఁ జూచుట.

శేషమ్మ.—నీవీ దుష్టురాలి యందభిమానము మానుటకును, జానకి కాఁపురమునకును ఏమిసంబంధము?

వేంకటేశ్వర.—దాని కాఁపురము చక్కఁబడుట మన కన్నిటికంటె ముఖ్యము.

శేషమ్మ.—అది సుఖపడ వలయునన్న విశ్వనాథము యొక్క దుర్బుద్ధి మానవలెను.

వేంకటేశ్వర.—వాని దుర్బుద్ధి యేమిటి?

శేషమ్మ.—ఒక్కటి రెండైనఁగదా చెప్పుటకు వీలగును! అవి పెక్కులు గలవు.

వేంకటేశ్వర.—సాధ్యమగు నంతవఱకును జెప్పుము.

శేషమ్మ.—వానికి దుస్సహవాసము మెండయ్యె. త్రాగుబోతులును, జూదగాండ్రును, వానియింటికిఁ దఱచురాఁ దొడఁగిరి. వాఁడును అనేక పర్యాయములు వారిగృహముల కరుగు చుండును. వానికింట నడుగునిలుచుట లేదు. రాత్రుల గృహమునందుఁ బరుండుట లేదు. సంపాదించు ద్రవ్యమెల్ల

ఎచ్చట దారఁబోయి యుండునో తెలియకున్నది! భార్యపేరు విషమగు చున్నది.

వేంకటేశ్వర.—నీకీ విషయములనెల్ల నెవ్వరు చెప్పిరి?

శేషమ్మ.—ఎవ్వరోయననేల? నీసోదరియే తెలిపినది.

వేంకటేశ్వర.—దాని మాటలకేమిగాని యాతఁడంతటి గుణహీనుఁడని విశ్వసింప నేరను.

శేషమ్మ.—నీ వెట్లు నమ్మఁగలవు! నీభార్యయన్న సత్య హరిశ్చంద్రుని సోదరియగుటచే నది 'పెద్దకొండ నెలుక మ్రింగిన' దన్నను నమ్ముదువు. ఇంతకును నేనొకరి ననవేల? నాకూఁతురు సమయమునకుఁ దగులాగున మాటలాడుటకును లాలించి బేలించి యెదుటి వానిని వశపఱచు కొనుటకు సమర్థురాలై యుండిన దాని కాఁపురమున కేలోటును లేక యుండు. ఈకాలము వారివలెఁ గపటనటన మాచరింపఁ దెలియ నిది. దాననేయిట్లు రచ్చలపా లగుచున్నది. వంచనావైదగ్ధ్య ములేనివా రీకాలమున భంగము నొందు చుందురు.

అంత వేంకటేశ్వరుఁడుగారును ఈమెతో నేమిపలికినను ఈవిషయమే యాడుచుండును గావున నీక మాటలాడిన నుప యోగము లేదనియెంచి అట నిలువక తనమిత్రుఁడగు నర సింహారావు నింటికి వెడలెను. ఈతఁ డేఁగినదిమొదలు శేష మ్మయు జానకమ్మయు మన సత్యవతి నెన్నియో మాటలాడిరి. అందులకామె పలుకకద య్యెను. వారు నీమెను జగడమునకీడ్వ నుపాయ మాలోచించు చుండిరి. ఆసమయమున నటకుఁ బొరి గింటి నరసమ్మ వచ్చెను. సత్యవతి కంటఁ దడిబెట్టుకొనుటఁ గాంచెను..

శేషమ్మయు జానకమ్మయు నప్పుడే లోనికేఁగియుండు టచే నీమెమాత్ర మొంటరిగా నుండెను.

నరసమ్మ.—సత్యవతీ! నేఁడేమి యిట్లు వ్యసన పడు చున్నావు!

సత్య.—అత్తా! నానొత్తి వ్రాఁతకుఁ జిత్తమునఁ గలఁగి విలపించు చున్నదాన.

నరస.—నీ వ్రాఁతకు లోటేమిటి?

సత్య.—పండువంటి కాఁపురము పాడగుటయే.

నర.—అందులకు నీవు చింతించిన లాభ మేమిటి.? దానికి దుర్బుద్ధిమానినఁగాని యాకాఁపురము సరిపడఁబోలదు. కావున దీనికిని నీవ్రాఁతకును నేమి సంబంధము? ఇంతకును మన జానకికి మంచిబుద్ధి వచ్చునని నాకుఁ దోఁచుట లేదు.

నరసమ్మ యిట్లాడుచుండ శేషమ్మయు జానకమ్మయు నఁట కరుదెంచిరి. శేషమ్మనీరి కడమాటవిని కోపోద్దీపితయై;

శేషమ్మ.—నీవును జానకిని దూషించుట కుపక్రమించితి వా! ఔరా! ఇదియెంతటి జాణ! నేనట్లేఁగఁగనే నాతనయపై నీతోలేని పోనికొండెములు చెప్పెఁగా?

నర.—అమ్మా! దానినేల కోపగించెదరు? నీకోడలు "పండువంటి కాఁపురము పాడగుచున్నదే"యని, చెప్పుటచే నిదిప్రసక్తమయ్యెను.

శేషమ్మ. — ఔరా! దీనిదుండగము! వచ్చినవారి యొద్దనంతయు "సిగ్గేనాయాఁడుబిడ్డ సరిగాఁ గాఁపురము సేయుటలే"దని కలహము సేయుచున్నయది. దీనిపొగ రట్లని పించు చున్నది.

సత్య.—అత్తా! మీతోఁ నాయాఁడుబిడ్డ విషయము చెప్పలేదు.

సర.—ఐననింక నెవ్వరివిషయము?

సత్య.—నావిషయమే యగును.

శేషమ్మ.—ఒసీ! పలుగాకీ! ముందు జానకి విషయమును బ్రస్తావమునకు దెచ్చితివి. ఇప్పుడు నీవిషయమని బొంకుచు "నాయత్త యిట్లన్నది. నాయాఁడుబిడ్డ యిట్లన్న" దని మాపై నేరముల నంపఁ బ్రయత్నించుచున్న దానవా! సమయమునకుఁ దగినట్లు మాటలాడుచు నీమాయల నెందఱ వంచింపఁ బూనితివి? నీమాటలిఁక సాగనేరవు. నాకొడుకేదో నాలుగు మాటలు వినుచున్నాఁడని ధైర్యమున నీవిట్లు వాగుచున్న దానవు. శీఘ్రకాలమున నీగర్వమణఁగఁ గలదు.

జానకి.—నాపై నసూయగలుగులా గొనర్చి తానేమో ధర్మాత్మురాలైనట్లు మగనితో "మీరిట్లుంచిన నామె యీయింట నుండుట కిష్టములేకఁ నేను బలికించితి" నని యొంచికొనును గాఁబోలును" అని తనపైన నపవాదము బడకుండు లాగునఁ జేసికొనెను.

శేషమ్మ.—నీచురాలా! నీవెంచినంత పని నీకుఁ జేయింతును. అప్పటికిఁ గానినీకు బుద్ధిరాదు—. నరసమ్మా! చూచితివికదా దీనిదుండగము!

అని యీమె మాటలాడఁగ నరసమ్మయుఁ దా నేమాట యాడినను దిట్లుగలుగు నని యెంచి బదులేమియు నాడక వెళ్లెను. అదిమొదలు వెంకటేశ్వరుఁడు వచ్చువఱకు నీమెను వారిరువురును బెక్కువిధముల దూషించు చుండిరి.

## అయిదవ ప్రకరణము.

# నవనాగరకసంఘము.



ఒక్కనాఁటి యుదయమునఁ జెన్నపురియం దుండు రామస్వామి మొదలారిగారి సత్రమునొద్ద ఒక్కఁడు వచ్చెను. అతఁడు సత్రపు టధికారియొద్దకువచ్చి యొకగది నద్దెకుఁ బుచ్చుకొని యందుఁ దనవెంటఁ దెచ్చిన పరుపు నునిచెను. గదితలుపులు తాళము వైచెను. అటనుండి బయలువెడలి ధారాగేహము (Pipe) నొద్ద కరిగి స్నానమొనర్చెను. బట్టలుదికి యారవైచి పట్టుబట్టల దాల్చెను. అచ్చటఁగల పూటకూలి యింట భోజనముచేసెను. పట్టణమంతయుఁ గలయఁజూడ నెంచి యొకగుఱ్ఱపుబండి నమర్చుకొనియె.

చిత్రవస్తు ప్రదర్శనశాలకుఁ (Museum) బోయెను. అచ్చటఁగల నానావిధ జంతువుల మృతకళేబరముల నస్థిపంజరములఁజూచి యానందించెను. పలువిధములగు చెట్లయాకులఁ గాంచి పరమసంతోషపరవశుఁ డయ్యెను. ప్రాచీనకాలపు శిల్పిచాతుర్యములఁ దెల్పు విగ్రహములఁజూచి పూర్ణముగ సంతసించెను. పూర్వకాలపు నాగరకమును వివరించు నాయుధములను, గవచములు, నాభరణములు మున్నగునవియును జూచి మోదమందెను. నానావిధములగు తాలును, బలువిధములగుకొయ్యలు, ననేకవిధములగు పంటలును, బెక్కువిధములగు వస్త్రములను జూచి డెందమున నలరెను. అచ్చటఁగల ప్రాచ్యలిఖితపుస్తకభాండాగారమున (Oriental Manuscripts Library)కుఁబోయి, పురాతనగ్రంథముల ననేకములఁ గాంచెను.

అచ్చటినుండి బయలుదేరి తిరువల్లిక్కేణికి వచ్చెను. అచ్చటి శ్రీపార్థసారథిస్వామివారి యాలయమునఁ బ్రవేశించెను. నాఁడు శనివారమగుటచే శ్రీవేంకటకృష్ణస్వామివారి సేవార్థమనేకులు నారికేళఫలములు, నరటిపండ్లును, నారింజపండ్లును దీసికొని శ్రీవారి దర్శనమునకుఁ బోవుచుండిరి. మార్గమధ్యమునఁ గొందఱు గ్రుడ్డివాండ్రు చేతఁ బళ్లెరములుదాల్చి 'స్వామీ! ధర్మముచేయుఁడీ! ధర్మముచేయుఁడీ!' యని యాచించుచుండిరి. మన యీ యువకుఁడును, సేవార్థులతోఁడఁ దానును దేవాలయములోనికి వెళ్లెను. వరుసగ నచ్చటి దైవదర్శనము చేసికొని యటనుండి సముద్రముగట్టుననే బయలువెడలి యుత్తమన్యాయస్థానమునకుఁ జనెను. అచ్చటఁగల విచిత్రములనెల్లఁ జూచుచుండెను. తనతోఁడ న్యాయవాదిపరీక్షకుఁ జదివిన పూర్వమిత్రులఁ గొందఱఁ గాంచెను. వారితోఁడఁ గొంతవడి మాటలాడుచుండె. వారి సంభాషణమునఁ, దన యోగక్షేమములఁ దెల్పునవసరమున భార్యావిసర్జనముదక్కఁ దక్కిన వెల్లఁ దెలియపఱచెను. అప్పటి న్యాయాధ్యక్షుల స్వభావాదుల గూర్చియుఁ గొంతవడి సంభాషించుచుండె. అప్పుడు రామానుజశర్మయను నీతని ప్రాఁతచెలికాఁ డచ్చటికివచ్చెను. వచ్చినవాఁ డీతని కుశలవార్తల నడిగెను. అంతట వారి కీలాగున సంభాషణముఁ జరిగెను.

రామా. — విశ్వనాథా! ఎన్నిరోజులకు నీపునర్దర్శనము గలిగె! మనప్రాఁత చెలిమిని దృష్టియందుంచుకొని యొక్కజాబైనను వ్రాయుటమానితివిగదా!

విశ్వ. — నన్నేమి సేయమందువు! పరీక్షలోఁ గృతార్థుఁడనై పోవఁగనే మాతండ్రిగారు మరణించిరి. అది

మొదలు సంసారభారమెల్ల నాపైనఁ బడియుండెను. వివాహము గూడ జరుగవలసియుండె. అందులకుగా నెన్నియో స్థలములకుఁ దిరుగవలసె. ఎచ్చటఁజూచినను, గుణముండిన రూపముండదు; రూప గుణములుండినఁ గులము తక్కువ; రూపగుణ వంశము లుండినఁ దల్లికో తండ్రికో దుస్సహమగు రోగముండును; ఇన్ని లక్షణములు గుదిరియుండినను వరదక్షిణ పూర్ణముగా నీయకున్న మాయమ్మగారి కిష్టముండదు. ఇట్లనేక ప్రదేశములఁ దిరిగితిరిగి వేసరితిని. తుదకు రాజమహేంద్రవరమున నిప్పుడు మండలరక్షక భటాధ్యక్షుఁ (Police Superentendent) డగు వేంకటేశ్వరుఁడుగారి సోదరిని నాకిష్టము లేకున్నను మాజననియొక్క నిర్బంధమునఁ బరిణయమాడవలసెను.

రామా.—నీకిష్టము లేక పోవుటకుఁ గారణమేమి?

విశ్వే.—కుల శీల రూపములలో సరియగునది మా మేన మఱఁదలగు శేషమ్మయను దానివివాహమాడఁ దలఁచి యుంటిని. కావున నా వివాహము నాకసమ్మతముగనుండెను.

రామా.—నీకిప్పు డెందఱు బిడ్డలు?

విశ్వే.—అంతటి యదృష్టము నాయట్టి యభాగ్యున కెట్లుఁ గలుగును?

రామా.—పసివాఁడవు. ఇప్పుడు గాకపోయిన నింకొకప్పుడైనఁ నీకుఁ గలుగకపోవునా? అందుల కింతవ్యసనమేల?

విశ్వే.—నాకెప్పటికిని, ఆయాస లేదు. కావున నావిషయమునఁ జింతించిన లాభము లేదని యెఱుఁగుదు.

రామా.—నీవట్లనుటకుఁ గారణమేమి?

విశ్వే.— దంపతులు సుఖముగ నున్న నే కదా యాయపేక్ష !

రామా.—నీభావము నాకుఁ దెలియుటలేదు. ఆమె జీవవతియే గదా?

విశ్వ.—ఉండినను లేకున్నను నొక్కటియే.

రామా.—ఏమట్లు వచియించుచుంటివి? ఆమె కేమైన ను బాధకలదా?

విశ్వ.—దానిబాధ భరింప శక్యముగాకున్నది.

రామా.—ఆమె రోగమునకుఁ జికిత్స చేయింపలేదా?

విశ్వ.—దానిరోగ మేమిచేసినను గుదురునదిగాదు.

రామా.—ఇప్పుడామె యెచ్చటనున్నది? నాహితుఁ డొకఁడు వైద్యశాస్త్రమునను, మంత్రశాస్త్రమునను, బ్రవీణుఁ డగువాఁడు గలఁడు. వానికిఁజూపినఁ జికిత్స చేయఁగలఁడు.

విశ్వ.—దాని రోగమునకుఁ జికిత్సయే లేదు. అది గుదురునెడల తనకుఁదానె కుదరవలయును. ఇంతకు నాయింతి పుట్టినింట నున్నది.

రామా.—పుట్టినింట కేలపోయెను?

విశ్వ.—దానియన్నవచ్చి పిలుచుకొని పోయినాఁడు.

రామా.—నీవును నీతల్లిగారు నెన్నివిధములఁ బ్రయత్నించియు గుణపడకపోవుటచేఁ బంపితిరి కాఁబోలు!

విశ్వ.—మేము పంపియుండలేదు, అతఁడేవచ్చి పిలిచి కొనిపోయెను.

రామా.—అట్టి దుస్సాధ్యమగు వ్యాధి యేదియో వినరింపుము.

అంతవిశ్వనాథవు, "అయ్యో! సిగ్గువీడి యీవిషయములెట్లు సెప్పుట! చెప్పక తప్పుటయెట్లు! ఇంతవఱకును మిత్రులేరికి నీవృత్తాంతము దెలుపక తప్పించుకొని యుంటి.

వారివిషయమున నంతనిర్బం ధింపకుండిరి. మఱియు వారి వలెఁగాక వీఁడు నాచిన్ననాఁటి చెలిమికాఁడు. ఇట్టివానికిఁ జెప్పక దాఁచుటయు న్యాయముగాదు. మానసము చెప్పు మని తొందరపెట్టుచున్నది. నోరు మాటను వెలికి రానీకు న్నది. ఈవిషయమైన నెట్టిసేఁత యనువగు! నాకెద్దియు గోచరింప కున్నది" అని పరిపరివిధముల నాలోచించుచు మౌనములో నుండ రామానుజ శర్మయు వీనిమౌనమునకుఁ గారణ మారయఁ జాలక ;

రామా.—చెలి కాఁడా! మిత్రవిభక్త మగువ్యసనము సహ్యావేదనమగు ననుట నీ వెఱుఁగనియదికాదు. ప్రాణమిత్రుఁ డగు నాయొద్ద జెప్పఁదగని యంశమేదియు నుండదని తలఁతు.

విశ్వ.—నెచ్చలీ! నీకడగోప్యమేమి గలదు? నాభార్య గట్టుగ సంసారముసేయుటకుఁ జేతఁగాక యిరుగుపొరుగు తగవులనింటిపైఁకుఁ దెచ్చుకొని నాకవమానము గల్పించు చుండెను. అత్తగారిమాట యన్నచిత్తమునకు సరిపడదు. భర్తయిచ్చు చొప్పున జరుపుట భారముగ నెంచును. పెద్దలమాట పెడచెవినిఁబెట్టును. చెలుల యుపదేశము చేటునకు మూలమని భావించును. మగని దిట్టుటమంచిదనియు, నత్తగారిని దూషించుట యత్యుత్తమ మనియు, గొప్పవారిఁ దిరస్కరించుట మెప్పునకుఁ గారణమనియు నెంచుచుండెను. ఇట్టిదానిని బెట్టుకొని యెట్టులఁ గాఁపురము సేయుదునని యెంచుచుండ నాపాలిటి దైవమో యనునట్లు వేంకటేశ్వరుఁడుగారే వచ్చి తమతల్లి చూడవలయునని యపేక్షించు చున్నదనిచెప్పి పిలుచుకొని పోయిరి.

రామా.—ఈ వరదక్షిణల మూలమున నెందఱి

కాఁపురములు చెడిపోవుచున్నవియో చూచితివా ! ఒక్కెడ బాల్యవివాహములు, నొకదిక్కున వరదక్షిణా కన్యాశుల్కములు నిట్టి దుశ్చర్య లెన్నియో చేరి మనదేశమును నాశమొందించుచున్నవి. సంఘసంస్కారణాభిలాషు లెంద తెంద తెన్ని పాటులు పడినను వమ్మగుచుండె.

విశ్వ.—ఇటఁగల నవనాగరక సంఘమిప్పు డెంత యభివృద్ధి నందియున్నది?

రామా.—చక్కఁగ నభివృద్ధమైయున్నది. ఇప్పుడాంధ్రుడను వాండ్రును బెక్కురు సభ్యురాండ్రు గలరు. అనేకు లీపద్ధతుల నవలంబించి యున్నారు. నేఁడు సాయంసమయమున నైదు గంటలకు నీసంఘపు బహిరంగ సమావేశము టంకసాలవీథిని 145వ కవాటసంఖ్యగల గృహమున జరుగఁ బోవుచున్నయది. నీవును రావలయును.

విశ్వ.—అట్లే వచ్చెదను. ఏవిషయమును గుఱించి యుపన్యాసము జరుగఁబోయెడెని ?

రామా. — వితంతూద్వాహమును గుఱించియు, స్త్రీలకు శాసనసభా సభ్యత్వమును న్యాయవాదివృత్తిత్వమును గల్గించుటను గుఱించియు నుపన్యాసములు జరుగఁ గలవు. స్త్రీలకు సద్గతికల్పింపవలె ననుటకై యాదినుండియు నీవుపాటు పడుచుండెడి వాఁడవుగా! మిత్రమా! నీ వీవయసున నిట్లుండుట నుచితము.

విశ్వ.—మఱేమి సేయుమ నెదవు ?

రామా.—వేఱు వివాహము గావించికొను టుచితము.

విశ్వ.—ఇంకఁ గొంతకాలము దామసించి చూచెదను. నాభార్య యిప్పటికిని గుణవంతురాలు గాకున్న నప్పటి కుచిత

మగురీతి నాచరింపవలయు నంతయేకాని తొందరపాటు సరి కాదు. ఇంక నాకు సెలవొసఁగుము. మరల సాయంకాల మానమావేశ సందర్భమునఁ గలిసికొందుము.

అని యాతని వీడ్కొని చెంతనుండు నొక చిఱుతిండుల మ్మునంగడికిఁ బోయి కొన్ని చిఱుతిండుల భుజించెను. అటనుండి బయలువెడలి రామస్వామిమొదలారిగారి సత్రము నకువచ్చెను. వచ్చుదారి నొకహితుఁ డెదురువడ వానిఁ దన తోడబండి నెక్కించికొని పోవుచుండెను. మార్గమధ్యముననొక వేపచెట్టుక్రింద జ్యోతిష్కుఁ డొక్కరుఁ డాసీనుఁడై యుండెను. వాఁడాదారిని వచ్చుచుఁబోవుచు నుండువారలకు గుఱిసెప్పు చుండెను. విశ్వనాథముతోడ నరుదెంచిన మిత్రుఁడు బండివాని నట నాఁపుమని కోరెను.

విశ్వ.—ఏల యిట బండి నాఁపుమంటివి?

రామా.—విశ్వనాథా! ఈజ్యోతిష్కుఁ డొకమల యాళదేశస్థుఁడఁట. భూతభవిష్యద్వర్తమానముల నెల్లఁ జక్కఁ గా నేర్చినవాఁడఁట. మనమాతనిఁ జూచివత్తము. వచ్చెదవా?

విశ్వ.—మిత్రమా! మనకేల యాతనిజ్యోతిషము! నాగరకశేఖరుఁడగు నీకును జ్యోతిషము మంత్రము అను పిచ్చి యింకను మానకున్నదిగా? పామరజనులవగిది నీవును ఈవెఱ్ఱినిఁబడి పోవుచున్నవాఁడవే! పొట్టకూటికై దొంగవేసము లూనిన యీనీచుల సమీపమునఁ జేరనియ్యరాదు. నిక్కపు మంత్రకాఁడును, సత్యపు జ్యోతిష్కుఁడు నుండుటయరుదు. ఒక్కచో నట్టివాఁడు నూటికొక్కఁడున్నను వాఁ డీట్లంగడి పెట్టుకొని కూర్చుండఁడు. మనదారిని మన మేఁగుదమురమ్ము.

హితు.—విశ్వనాథా! నీవు వచియింపునది పూర్ణ

ముగా నేను గాదనను గాని జ్యోతిష్కుల మాటలు మాత్ర మబద్ధము గాదని నేను నిరూపింపఁగలను.

విశ్వ.—మాంత్రికులపై నవిశ్వాస మెప్పటినుండి కలిగె?

హితు.—నిరుడు మా యక్కగారికి భూతచికిత్స చేయుటకుఁ బ్రారంభించితిని. అప్పటను నొక యోగీశ్వరుఁ డచ్చటి కరుదెంచెను. మావా రెల్లరును వాఁడింద్రజాల మహేంద్రజాల గోకర్ణ గజకర్ణ విద్యల సాధించిన వాఁడని పొగడుచుండిరి. నాకును ఆలాటి విషయములలో నమ్మక ముండుటచే నియ్యకొని వానిని బిలిపించితిని. వాఁడా మకు దయ్యము సోకుఁడు గలిగినదని నిత్యమును మాదేవతాగృహ మున బొగ్గు, పసుపుఁబొడి, యెఱ్ఱకుంకుమ, పచ్చకుంకుమ, బియ్యపుబిండి మొదలగు వానితో ముగ్గులువేసి మాయక్కను దానిమధ్యను గూర్చుండఁబెట్టి; పెక్కుశ్లోకములతోడ ననేక మంత్రములు జపించుచు ఆతీర్థము నామెకు నిచ్చులు నోసఁగు చుండెను. వైద్యు లనేకు లిది వ్యాధిలక్షణమేగాని యన్యము కాదని చెప్పుచుండినను వారిమాటలను సరకు సేయక ఈమంత్రగానినే నమ్మియుంటిని. నిత్యము స్నానము చేయు టచేతను, ఉపవాసాదులచేతను ఆమె శరీరము కృశించి రక్తము క్షీణించి తెల్లబాఱఁ జొచ్చెను. మాంత్రికుఁడు "భూతము యొక్క బలము తగ్గుచుండుటచే ఇట్లు కృశించుచున్నది కాని వేఱుకాదు. శీఘ్రముననే యీమె శరీరము బాగుపడఁ గలదు. ఈభూత ప్రీతికరముగ బంగారము దానముసేయవల యును." అని చెప్పి నావలన నొకతులము బంగారము గ్రహించి యెచ్చటికో వెడలిపోయెను.

విశ్వ.—మోస పుచ్చుటకుఁ బ్రారంభించెఁ గాఁబోలు?

హితు.—ఆవల కొంతసేపు తాళివచ్చి ఆటక్కరి నన్నడిగి యొక్క పరకరూపాయి తీసికొని దానికిచుట్టును దనచేతఁగల పసియాకు పసరు పూసి తన చిలిమిలోఁ బెట్టి గంజాయి పీల్చుట కారంభించెను. ఆవలఁ బాతికగంట కెల్లను చిలిమిలోని నిప్పును గ్రిందఁబోసి దానఁగల పరకరూపాయినెత్తి నీటవైచెను. అయ్యది నీటినుండి యెత్తునప్పుడు స్వర్ణమయ్యెను. పిమ్మట నాతఁడు "స్వామీ! ఈలాగుననే వెండినుండి స్వర్ణము తీయనగును. దీనికే జాతరూపమని పేరు. మీకు నచ్చునటుగా నాచిలిమియందుఁ గొంచెము చూపితినిగాని విశేషముగా వలయునేని వేయిగాఁబుటము వేయ వలయును. అది యొక్కరేయెల్లనట్లె యుండిన మఱునాఁటి యుదయమునఁ బచ్చని బంగారమగు" ననెను. నేనును వాని యిష్టప్రకార మొక్కదినము రాత్రి మావాకిలి వైపునఁగల గదిలోఁ బెద్దగోతిని ద్రవ్వి యందు మాయింటఁగల వెండి వస్తువుల నెల్లఁ బాతనారంభించితిని. ఇరుగుపొరుగునఁ గల వారును నాబోటి వెఱ్ఱులే యగుటఁ దమయింటఁగల వెండి వస్తువులెల్ల నా[illegible]చిరి. అంత నాపల్లము నిండి పోవ దానిపైఁ బొమికల కుచ్చెలనిల్పి నిప్పంటించితిమి. మేమచ్చట నర్ధరాత్రము వఱకునుండి యావల నింటికిఁ బోవనేఁగితిమి. మాకెల్లర కాతనిపై మిక్కిలి నమ్మకముగలదు. కావున మే మెవ్వరమును సందేహింపక యుంటిమి. మఱునాఁటి యుదయమున లేచి చూడఁగ ఆయోగీశ్వరుఁడు గానుపింపకుండెను. ప్రాతఃకాలమున స్నానముకొఱకు సముద్రమున కరిగియుండు నని తలఁచితిమి. ప్రొద్దెక్కెను. అప్పటికిని రాకుండెను సంశయించి గదిలోని పల్లము నొద్దకుఁబోయి చూడఁగ నిప్పార్చి,

గోతిలోని వస్తువులెల్ల సంగ్రహించుకొని యా మోసగాఁడు, వెడలిపోయె ననుట గోచరించెను. అప్పటినుండి నావ్యసనము నకు మేరలేకుండెను. ఒకటిరెండుగాదు. నాలుగువేలు రూపా యలు విలువగల రజతపాత్రములు చోరునిచే నపహృత మయ్యెను. అదిమొదలు నాకీమంత్రపుఁబిచ్చివదలి పోయెను. ఆవలవైద్యులచే మందిప్పించితిని. క్రమముగా మాయక్కకు శరీరము గుదిరెను.

విశ్వ.—ఎద్దియు స్వానుభవముననఁగాని తెలియ దనుట వాస్తవము. ఇఁకజ్యోతిష్కుని విషయముకూడ నిట్లే కదా తెలియవలసి యుండును !

అని వీరు మాటలాడికొని యామలయాళపు జ్యోతి ష్కుని సమీపించిరి. అచ్చటనుండువా రనేకులు పామరు లగుటను నాతనిఁ బలువిధముల మెచ్చికొనుచుండిరి. అచ్చటి కీమిత్రు లిర్వురు బోవఁగనే వీరినిఁ జూచిన యాజ్యోతిష్కుఁ డు గొంచెము కలఁత సెందియు నన్యులు సందేహింప కుండులాగున ఆవిషయమును బైకిఁదోఁపనీయక యుండెనుకాని విశ్వనాథము మాత్ర మది గనిపెట్టి యందులకుఁ గారణ మారయఁ జాలకుండెను. మఱియు నాతఁడఱవము వారితోఁ దెనుఁగును, దెనుఁగువారితో మలయాళమును మాట లాడుచుండెను. అయినను వానిమాటల వైఖరిని జక్కఁగ బరిశీలించిన వాఁడెవ్వఁడో తూర్పుదేశపు వాఁడనుట విశద ముగాఁ గలదు. అంతవిశ్వనాథముయొక్క మిత్రునిగాంచి;

జ్యోతి.—ఓహో! రంగనాథముగారూ! రండు. రండు. చాలరోజులకు తమదర్శన మబ్బెను.

రంగ.—నాపేరు రంగనాథమని తమ కేలాగుఁ దెలిసెను?

నిరుడు చింతాద్రిపేటలోఁ జలమయ్యగారి యింట జ్యోతిషము చెప్పుటకు వచ్చియుండ మీదర్శన మచ్చటఁ గలిగెను. ఆవల రెండుమూఁడు పర్యాయములు మనము కలిసి మాటలాడి యున్నాము. అయ్యది మఱచితిరిగా!

రంగ.—మిమ్మది వఱకుఁ జూచినట్లు నాకుస్మరణకు రాలేదు. కాని గొంతుసవ్వడిమాత్రి మెచ్చటనో విన్నట్లున్నది.

జ్యోతి.—మీరుమఱచి పోయితిరిగాఁబోలు! అది యుండనిండు. మీరిచ్చటికొక కార్యార్థము నాయొద్దకు వచ్చినట్లున్నది. అదియే కార్యమో?

రంగ.—తిమరి నొకప్రశ్న యడుగఁ దలఁచి వచ్చితిని.

జ్యోతి.—అయ్యా! నూటయెనిమిదింటఁ దక్కువ యంకె నెద్దేని సెలవిండు.

రంగ.—ముప్పదిరెండు.

జ్యోతి.—[ఏదియో లెక్క సేయు నట్లభినయించి] మీరడగినది చోరప్రశ్న. ఇయ్యది చరలగ్నము. లగ్నమున శనియున్నాఁడు. అది వానికుచ్చస్థానము, కాఁబట్టి చిక్కదనియే చెప్పవలసి యున్నది.

రంగ.—నేననిది చిక్కునని యెంచుటలేదు. అయినను జెన్నరాజధానిలోఁగల యొక్కొక్క మండలమునకును జోరగ్రస్తమైన సొత్తుల వివరములం దెల్పు పట్టికల నంపి యున్నాను. కావున నాదొంగ చిక్కినచో వాని నిర్మూలితుం గావించెద. నాకాజ్ఞ యొసంగుఁడు.

అని వానిచేతిలో నొకరూప్యమొసఁగి వెడలిపోయెను.రంగనాథముతో మఱల బండి నెక్కెను. బండివడిగాఁ బోవుచుండెను. సత్రము వాకిట బండినిలిచెను. మిత్రులిర్వురు బండిదిగిరి. రంగనాథ

ము తన చెలికాని యొద్ద సెలవు దీసికొని వెడలెను. విశ్వనాథము దనగదిలోనికరిగెను. పవలంతయుఁ దిరుగుటం జెమ్మటం దడిసియుండు దుస్తులు దీసివైచి క్రొత్తవాని ధరించెను. మరల బండి నెక్కి దానిని టంకసాలవీథికిఁ బోవ నమర్చుకొనియె. బండివాఁ డతివేగముగఁ దనబండిని బోనిచ్చె. సకాలమునకు 145-వ కవాట సంఖ్యగల గృహమునకుఁ జేరెను. బండిదిగి విశ్వనాథము లోని కరిగెను. మిత్రులనేకు లెదురువచ్చి యీతని దోడ్కొని వెడలి యుచితాసనాసీనుం గావించిరి. సభ్యులెల్ల రాసీనులైరి. కమలాబాయి గారధ్యక్ష పదవి నంగీకరింప వలయునని యచ్చటి సభ్యులెల్ల నేకగ్రీవముగననిరి. ఆమెయు వారిమాటలఁ ద్రోసిపుచ్చక యాదుల కంగీకరించెను. ఆబిడ, తన్ను టధ్యక్షురాలుగ నియమించినందులకుఁ గృతజ్ఞతంజెల్పి కార్యక్రమములను గుఱించి సంగ్రహముగ నుపన్యసించెను. అంతఁ బండిత వాసుదేవ శాస్త్రిగారు వితంతూ ద్వాహమును గుఱించి;

వాసు.—ఈశ్వరుఁ డెల్లరయెడలను సమబుద్ధి కల వాఁడగుఁగాని విషమబుద్ధిగల వాఁడుకాఁడు. ఈశ్వర ప్రోక్తములగు శాస్త్రములును అట్టివేయగును. కావునఁ బురుషునకు మాత్రము పునర్వివాహము గూడునపుడు స్త్రీలకది యేల కూడకుండు ? శాఖా చంక్రమణ న్యాయమున శాస్త్రముల నచ్చటచ్చటఁ గొంతకొంత యభ్యసించియు, అట్లుగఱచిన వారికి నపార్థములు సేసికొనియు నిట్లనేకులు చెప్పుచున్నారు. లోకము నంధకూపన్యాయమున నొకరి పోకడల ననుసరించుటయేకాని న్యాయాన్యాయ విచారము సేయుట లేదు. శాస్త్రప్రమాణముల నాలోచించిన;

"నష్టేమృతే ప్రవ్రజితే క్లీబేచపతితే పతౌ । పంచ స్వాపత్సు నారీణాంపతి రన్యో విధీయతే"॥

అని భర్తృ మరణానంతర మన్యపతి వరణము యుక్తమని ఘోషించు చున్నవి.

మహామహోపాధ్యాయ రామచంద్ర శాస్త్రిగారు; పండితులవారు సెలవిచ్చినది కాదని నేనుచెప్ప సాహసించువాఁడను గాను. కాని మనకిప్పుడు ప్రథమ కర్తవ్యమదికాదు. బాల్యవివాహముల మాన్పవలయు. వరశుల్క కన్యాశుల్కముల విధ్వంసము గావింపవలయును. పురుషులతోఁ బాటు స్త్రీలకును స్వాతంత్ర్య మీవలయుట యుక్తమగు. వారికి శాసనసభాసభ్యత్వమును, న్యాయవాది వృత్తిత్వము నిప్పింపవలయును. నిర్బంధ విద్యాభ్యాసమును గుఱించి ప్రయత్నింపవలయు. పైవిషయములకుగాఁ జట్టముల నేర్పఱుపుమని శాసనసభవారిం బ్రార్థింప వలయును.

లక్ష్మీనరసమ్మ.—స్త్రీ విద్యల నింక నభివృద్ధి సేయవలయును. వీరికిగా న్యాయ శాస్త్రముల బోధించుటకుగాఁ బ్రత్యేక కళాశాలల నేర్పఱుప వలయును.

చిదానందయోగి.—బాల్య వివాహముల మాన్పవలయు ననుట శాస్త్రవిరుద్ధ మగునుగదా!

రామావధానులు.—ఇయ్యది శాస్త్రవిరోధము కాఁజాలదు. శేషహోమమును నాఁటి సమావేశ మంత్రముల కర్థమాలోచించిన మీకది విశదము కాఁగలదు. పూర్వపుటాచారము సరిదయగు. మహమ్మదీయులు నిర్బంధించి మనకన్యలఁ గొనిపోవుచుండుటచే వివాహాంత రైనచో వారు దానికి కుదురను నుద్దేశముతో నిదియేర్పడెను. మఱియు

నాకాలమున మంగళసూత్ర ధారణమును లేకుండెడిది. మాంగల్య ధారణకు వేదముల మంత్రములు గాన్పించుటలేదు. వివాహమునకుఁ బాణిగ్రహణమనియే పేరిడియుండిరి కాని మాంగల్య ధారణమని నామము పెట్టలేదు. ఇదియుఁ దురుష్కులకు వివాహితావివాహితా భేదము దెలియుటకై యేర్పడినదియే యగును. ఇక్కాలమున నట్టి భయములకు హేతువు లేనందున మనపూర్వులవలె మనమును ప్రౌఢా వివాహములే యాచరింప వలెను. బాల్యవివాహపు పద్ధతిని నాశనసేయ వలెను. ఇదియే వితంతుత్వమునకు మూలకందము.

వాసుదేవ శాస్త్రిగారు.—మీ రాడినదెల్ల వాస్తవము, మనసభవారికి విషయమునందగు శ్రద్ధపుచ్చికొని పాటుపడవలయు. ఇయ్యది కేవలము మాటలతోఁ జెల్లుపెట్టక తమతమ తనయులకు వీరుబాల్యముననే వివాహము సేయుట మాన్పవలెను. ఇట్టిబాల్య వివాహము చేసినచో నట్లొనర్చిన వారికిఁ గఠినముగ దండన విధింపవలసిన లాగున శాసన మొక్కటి యేర్పఱుప వలెనని శాసన సభకు విన్నపము వ్రాసికొన వలయును.

అంత నధ్యక్షురాలు లేచి;

"నాకీవ తెంపసమునారి; పండితోత్తము లార! నేటి యుపన్యాసము నందలి విషయములు మీకెల్లరకును వచ్చి నదగుననియే నావిశ్వాసము. మీ రిప్పు డొనర్చిన కరతాళధ్వనులే మీయంగీకారమును సూచించు చున్నవి. మన మీవిషయములనెల్ల శాసన సభవారికి వ్రాసియంపెదము. ఇంతటితో నేటిసభ చాలింతము"

అనివచించి యామెతన స్థానమునఁ గూరుచుండెను.

అంత సభాకార్యదర్శి యధ్యక్షురాలికిని సభ్యులకును కృతజ్ఞతాభివందనములఁ గావించి సభచాలించెను. విశ్వనాథమును రామానుజశర్మ మున్నగువారిని వీడ్కొని తానొకబండి నెక్కి రామస్వామి మొదలారిగారి సత్రమునకరిగెను.



ఆఱవ ప్రకరణము.

# దురాలోచన



జానకమ్మ వచ్చిన నాఁటినుండి శేషమ్మకు సత్యవతిపై నసూయ మెండయ్యెను. సమయము గలిగినప్పుడెల్ల వేంకటేశ్వరు నొద్దఁ గలహము సేయఁ దొడఁగెను. ఏమియొనర్చినను లాభమేమి? ఆతనికి మాత్రము భార్యపై నణుమాత్రము నప్రీతియుదయింపకుండెను. కలహముచేసాధ్యమయినంత నలకును బ్రయత్నించి చూచెను. అదెల్ల భస్మాహుతియయ్యెను. జానకమ్మచేఁ జెప్పించెను. అదియాతనికిఁ బొత్తిగ సరిపడలేదు. అయినను గార్యము కొనసాగ లేదని యాబిడ తనప్రయత్నమును మాన కొనలేదు. ఎన్నిప్రయత్నములు చేసినైనను సత్యవతి నింటనుండి లేఁటిము వలయునని యేయోచు చుండెను. సత్యవతికి నియ్యది తెలియక పోలేదు. అయినను దేవునిపై భారమునైచి ధైర్యమువలంబించి యుండెను. శేషమ్మయు, జానకమ్మయుఁ దన్నెన్ని బాధలుపెట్టిననెంతతిట్టినఁ దన ప్రారబ్ధ దిగుటచేఁ బడవలసివచ్చెఁగాని యన్యముగాఁదని యెంచుచు, భర్తతో నించుకైన నావిషయమును జెప్పకుండెను. వారొనర్చు బాధలచే నెంత కష్టము గలిగినను

దానినెల్ల నొక్కవైపునఁ ద్రోసివుచ్చి భర్తయెడ భయ భక్తులు గలిగి మెలఁగుచుండెను. ఆతని పరిచర్యల యం దనవరతమును అత్యాసక్తయైయుండెను. వేంకటేశ్వరునకు సత్య వతిచెప్పక పోయినను, ఆమెచింతలపాలై యున్నదనుట దెలి యక పోలేదు. అందులకుఁ దా నేమి సేయఁగలఁడు? అటుఁ దల్లి కెదురాడ భయమొందును. ఇటుభార్యయొక్క దుఃఖ మును జూచి సహింపఁ జాలఁడు. ఈలాగున నేమిసేయుట కును దోఁచక మిన్నకుండెను.

ఒకనాఁటి మధ్యాహ్నమున వేంకటేశ్వరుఁడు గచ్చే రికిఁబోయియుండెను. సత్యవతి భుజించిగదియందొక కురిచీపైఁ గూరుచుండి 'సీతాదేవి' యను గ్రంథమును జదువుచుండెను. అందు సీతాదేవిని అశోకవనమున రాక్షసాంగనలు బెదిరించు ఘట్టమువచ్చెను. దానింజూచి; "జగన్మాతయగు సీతకు నిన్ని కష్టములా? అట్టి మహాత్మురాలే కష్టముల వలన విముక్తి నొందఁజాలకయుండ నింక మాబోంట్లగాక లెక్కయా? ఎప్పటి కెయ్యదిగల్గినను అనుభవింపక తీరదు. విధిగడువ నేరు శక్తు లు? ఔరా! జగజ్జననియై, జనకరాజర్షి తనయయై, దశరథుని కోడలై, రాక్షసాంతకుఁడగు శ్రీరామునకు భార్యయయ్యును ఇట్లనదవలె రాక్షసీ పరిత్రాసితయై వ్యసనపడు చుండెఁగా!" అని తలఁచుచు జానకీ వ్యసనమునకుఁగాఁ దాను దుఃఖమంది కంట నీరుగార్చుచుండెను. ఆసమయమున జానకమ్మ చప్పుడు చేయక వెనుకనైపుననుండివచ్చి చూచెను. వెంటనే తల్లియొద్ద కేఁగి సత్యవతి యేడ్చుచుండుట శేషమ్మతోఁ జెప్పెను. ఆమె యు గూఁతుమాట వినినతోడనే యాతురమున నటకువచ్చెను. ఆతీరుననున్న కోడలింగాంచి;

శేష.—ఓసీ! నంగనాచీ! ఎవ్వరు వచ్చిరని నిండిన యింట నిల్లేక్కుచున్నదానవు? అంతగా నేడ్వవలెననియున్న నీపుట్టినింటికింబోయి ఆశదీర నేడ్చికొనుము. దాని ఫలము నీ తండ్రికింగాని నీతమ్మునకుంగాని కలుగనిమ్ము.

సత్య.—అమ్మా! శ్రీరామాయణ కథను జదువుచుంటిని. సీతాదేవిని రాక్షసస్త్రీలు బెదిరించెడి ఘట్టము చదివినంతనే యామెబాధలం దలంచి వాపోనం దొడంగితిని.

శేష.—ఆఁను దాసీకింటం బను లెన్నియో యుండ వానినెల్ల వీడి యెల్లప్పుడును బుస్తకములను జదువుచుండిన నిచ్చటిపనులెవ్వరు సేయుదురు? నియమ్మవచ్చి చేయునని తలంచితివే? మగం డింటనుండువఱకు కన్నిపనులును జేయుదానివలె నటించుచు వాఁడటు వెడలఁగనే ఇట్లేవ్యాజముననైనం బ్రొద్దుపుచ్చుట నీపనియై యున్నది. నే నెన్నియోమాటులు నయ భయములం జెప్పియుంటిని. ఎంత చెప్పినను జెవిటికి సెంకూదినట్లగుచున్నది.

సత్య.—మీమాటల నే వినకుంటినా? మీచెప్పిన చొప్పున నడచికొనుట నావిధియై యుండ నందులకు నేనేల వ్యతిరేకింతును? మీ రేమి యానతిచ్చినను జేయుటకు సంసిద్ధురాలను. నాపై నాగ్రహముమానుఁడు.

శేష.—ఔనౌను. నిజమాడిన నిష్ఠురమే యగును. కలతెఱంగెఱింగించిన నాగ్రహించితి నని మా పలికెదవు!

జానకమ్మ.—అమ్మా! ఈబిడ యాఘట్టమును జదువుచున్నటులం జెప్పుటకుం గారణమును నీవింకను గ్రహింపకున్నావు. తాను సీతవంటి సాధ్వియనియు మనము రాక్షసులవంటి క్రూరులమనియు, వారుసీతను బాధించినలాగున మన మీబిడ

ను బాధించు చున్నామనియు మన కెఱుక పఱచుటకు మాఱుగ అన్యాపదేశమున నిష్ఠూరమాడుచున్నది.

శే.—ఓసీ! రాక్షసీ! మమ్మా రక్కసులఁ జేసితివి! ఎంతబిరుసెక్కినావే! ఇట్టిదానవు గాకున్న భర్తను వలలో వైచికొని నిలువుదోపుడు చేసినవి?

సత్య.—నా కాయుద్దేశము లేదు. నా కెప్పుడు నట్టిదుర్బుద్ధులు గలుగవు. కావున మీ రాభావము మానవలయును.

శేష.—'నా కెప్పుడు నట్టి దుర్బుద్ధులు గలుగ'వనిన మాకాయట్టి దుర్బుద్ధులు గలవా? నీతండ్రి మండలన్యాయాధిపతిగానున్నాఁడను గర్వమున నిట్లు విఱ్ఱవీగుచున్న దానవు. నిరుపేద కొంపలబ్బియుండిన వాని భార్యకుఁ గొడుకునకును బెట్టును గాని మాకొక్క కాసైనను బెట్టఁబోఁడు.

సత్య.—మీ రేమాడినను బడుటకు నేను సిద్ధముగ నున్నాను. వ్యర్థముగ నాపై రేల మెత్తెదరు? ఎదుటఁబడి యెంతమైన ననవచ్చునుగాని మఱుఁగున ననుట పాపావహము.

జానకి.—నీతండ్రి యొక ధర్మాత్ముఁడు; నీవొక ధర్మాత్మురాలవు; మిమ్ము దూషించినఁ బాపముగలుగుఁగాఁబోలు!

సత్య.—అమ్మాయీ! నీ వెట్లాడినను నీకిట బదులాడను.

శేషమ్మ.—ఓసీ! ఏదేమో యాడిన నూరకుండక యదలించెదవా! అప్పుడే నీకింతటి స్వాతంత్ర్య మలవడెనా! ఇంక నిది యత్తగారిరాజ్యముగానే యున్నది. కోడలిరాజ్యముగా మాఱలేదు. ఆసమయమున నీయింటికి ఇదివచ్చిన బెదిరింపవచ్చునులే! అంతవఱకు నీవిచ్చటఁ గాపురము చేయుచుండినఁ జూచుకొందము.

సత్యా.—మనమెట్లు తలంచినను దైవమొకటి యున్నది గదా! దాని యిచ్ఛచొప్పున నన్నియు జరుగగలవు!

శేషమ్మ.—ఓహో! మగండేనో నాలుగుమాటలు వినుచున్నాడని యెంచి గర్వింపకు మమ్ముగాదని వాడెప్పు డేపనియు జరుపడనుట నిశ్చయము. శీఘ్రముగనే నీకది స్పష్టముకాగలదు.

జానకి.—నిప్పంతమనంతివఱకు నూరకుంటిని. నీ వటుం బోవఁగనే నోటికివచ్చినట్లెల్ల నన్ను దూషించును.

సత్యా.—అమ్మాయీ! ఏల యసత్యము లాడెదవు?

శేషమ్మ. — నాకూతురసత్యమాడునదియు నీవు సత్యమునే పలుకుచుండెడి దానవుగాఁబోలు! సుఖపడఁజాలు వారలకు నాత్మస్తుతియు, [illegible]దయుం బనికిరాదు. ఇంక నిన్నెట్లైన నదృశ్యముసేయు నుపాయము వెదకెదఁగాక. నీచునాలా! నీబ్రతుకునకు నన్నుగూడ దూషించుటయా!

సత్యా.—నేనేమియు దూషించుటలేదు. నోటికి వచ్చిన ట్లేల నిందించి నేనేమియు నాడలేదని యసత్యము పలికితినా?

శేష.—నీ [illegible] కలిగియుంటివి. నీయబ్బ బాల్యమున న్నెట్లగలదో, నీతాత యెట్టివాఁడో యెఱుగక యున్నాను. ఇట్లు నెదిరించుచుండిన నీకుఁబుట్టినిల్లే శరణమగును.

ఈమాటలాలకించిన సత్యవతియు మదినొంతయు నొచ్చుకొనక . . . [illegible] బదులాడుచుండిన నామె మాట లప్పటప్పటికి [illegible]ంచుచుండు నని యెంచి తినగదిలోని కరిగెను. ఆసమయమున రామచంద్రుడు స్నానము యచ్చటికి వచ్చెను. వచ్చిన వాడు శేషమ్మను చూచి;

రామచంద్ర.—అమ్మా! మీరేల యీలాగునఁ గాంతి

దఱిగి యున్నారు? ఇంటనెల్లరును గుశలమేకదా! జానకమ్మ యెప్పుడు వచ్చెను? విశ్వనాథమును వచ్చియుండెనా? అబ్బాయిగా రెచ్చట? మన సత్యవతి గానరాకున్న దేమి?

శేషమ్మ.—మాయింటి విషయములెల్ల నీ మూఁడు నెలలలోఁగ నెంతయో మాఱుపాటుచెందెను. సత్యవతి యేమియు నెఱుఁగనిదని కదా మనమెంచియుంటిమి! అది భర్తనువశము గావించికొని లోలోన మాపైఁగొండెములు చెప్పుచుండును. అబ్బాయి దానికిలోఁబడి మామాటలు విన కున్నాఁడు. విశ్వనాథము దుస్సహవాసముచే దుర్వర్తనుఁడై భార్యను వదలెను. కాఁబట్టియే జానకి యిటనున్నది. ఇదివచ్చి నదిమొదలు సత్యవతి పూర్వమునకంటె నధికముగ విజృంభింపఁ దొడఁగెను. మందుమాకులును దెలిసినదని తోఁచుచున్నది. భర్తకేవేళ ఏలాటిమందిడునో యని భయపడుచున్నాను. ఇది యీ యింట నుండువఱకును మాకాఁపురము గుదుటవడనేరదు. ఎప్పుడు జానకికి విషముపెట్టి చంపునోయని భయపడుచున్నను.

రామా.—ఈ మాత్రమునకు మీరింత వగవనేల? చూడుఁడు నాసామర్థ్యము! ఆమెనెట్లైన నిటనుండి యుద్వాసనము గావించెదను. కాని నే నిప్పుడు చెన్నపురికిఁ బోవలసి యున్నది. అచ్చటఁ గొంతకాల ముండవలయును. అంత వఱకుఁ గొంత యోపిక పట్టియుండుఁడు. ఇట్లు నేఁబోవకున్న నాఱు వందలు రూపాయలు నష్టముకల్గును.

శేష.—'నాకాఱువందల రూపాయ లిచ్చినఁగాని మీకార్యము సేయఁజాల'నని మీమాటల కిట నెదురాడు వారెవరు? అట్లుండ నసత్యములాడనేల? ఇదె యీకాసుల పేరుగైకొనుఁడు. ఎట్లైన నీపిశాచము నిటనుండి యుద్వాసనము

గావించు భారము మీపైసవైచికొనుడు. మాకుఁ గార్య మనుకూలించుట యొక్కటియకదా కావలయును?

రామ.—ప్రొద్దున లేచినదిమొదలు దినుచుండునదెల్ల మీయన్నముగాక వేఱేమియని యెంచితిరి? అట్లుండ వారి వీరివలె మిమ్ములంచమడుగఁ బోయెడివాఁడనా? నాకచ్చటఁ గల్గు నష్టమును మీకెఱుకపఱచితి నంతియేకాని మిమ్మా పైకమిమ్మని యడిగెద ననుకొంటిరే! మీయనుగ్రహమున్న ఆద్రవ్యము నాకంత గొప్పయని భావింపకుఁడు. మీరిప్పుడు వేయిరూప్యము లిచ్చినను బుచ్చుకొను వాఁడనుగాను కాని మీరనుగ్రహమున నొసఁగు కాసులపేరు నంగీకరింపక తిరస్కరించుట మిమ్మవమానము సేసినట్లగునని కొను వాఁడను.

అంత శేషమ్మ కాసులపేరు దీసికొనివచ్చి యిచ్చెను. రామశాస్త్రియు నద్దానిఁ గైకొనెను. జానకమ్మ మాత్ర మంతటినగపోవుట కొకవైపుఁ జింతయు, ఎట్లున నింక సత్యవతి కుద్వాసనము జరుగఁగలదు కదాయని యుత్సాహ మొక వైపునను గల్గి చింతా సంతోష మధ్యగతయై యుండెను. శాస్త్రియు నానగను బదిలముగా ముడివైచికొని "ఇంక నాప్రశ్నను జూడుఁడు. మీరని పూర్తియైన దనియే భావిం పుఁడు. నాఁకిక సెలవిం"డని వారియాజ్ఞఁగైకొని యరిగెను. శేషమ్మయు జానకమ్మతోడ నింటిలోని కేఁగెను.



ఏడవ ప్రకరణము.

# కొండెములు సెప్పుట.



"అమలా పురపు రక్షకభటాధికారి దొంగలఁ బట్టఁ దనకుసాయము వడ నను రమ్మని కబురుపంపి యున్నాఁడు. నే నెల్లినను బోయితీరవలయును. సత్యవతిని పీడికదా పోవల యును! అల్లుపిడిన నూతెల్లి దీని నెచ్చట రచ్చలపాలు గావిం చునో తెలియకున్నాను."

అనియెంచుచు వేంకటేశ్వరుఁడు బయలుదేఱ నుం చెను. మరలభార్యతోఁ జెప్పక యేఁగుటకు మది యొప్ప నందునఁ బడకటింటి యొద్దకుఁ బోయెను. గవాక్ష రంధ్రముల నుండి సత్యవతిం జూచెను. అప్పుడామె మోమునఁ జెమ్మటఁ గ్రమ్మి యుండెను. కన్నులనుండి యశ్రుధార జలజల రాలుచుండెను. ఇదిగాంచినంతనే యాతని గుండి యలు జల్లుమనెను. ఆటుసితి యందుం దామెను విడిచి వెడలుట సరికాదని భావించెను. తనయుద్యోగ ధర్మమున కది సరికాదని యెంచి వెడలుటయే మంచిదని మరల తలఁచెను. ఇట్లితికర్తవ్యతా మూఢుఁడై తామరాకులోని నీటచంద మునఁ దల్లడిల్లుచుండెను. తిన్నఁగా నామెను సమీపించెను. వెనువైపున నిలిచెను. అడుగుల చప్పుడు వినుటచే నలికిపడి యులికిపడి తిరిగిచూచెను. భర్తను జూచినంతన తన వ్యసనమును మఱుఁగునఁబడ నెంచి కన్నుల నీరు చెఱఁగుతోఁ దుడిచివైచుకొనెను. ఆతని పాదములపై వ్రాలి నమస్కరించి;

"నాథా! వివాహకాలమున మీరాడినమాట మఱువ

కుఁడు. ఎట్టి సమయమునను నను విడువకుఁడు. రామచంద్ర శాస్త్రి కపటవర్తనుఁడు. కాఁబట్టి అతఁ డెట్టి కొండెములు సెప్పునోయను భయమున నేనీలాగున నాడుచున్నదానను."

"ప్రియా! నీవిటు లాడుటకుఁ గతమేమిటి?"

"రామచంద్ర శాస్త్రి చెన్నపురినుండి నిన్నరాఁగనే మనయింటికి వచ్చెను."

"చెన్నపురినుండి కాదు. జగన్నాథమునుండి వచ్చెను."

"మీ రేమైనఁ బొరఁబడితిరేమో కాని యాతఁడు చెన్నపురినుండి వచ్చితిననియే మా యత్తగారితోఁ జెప్పెను.

"నాతోఁడ నట్లు చెప్పియుండుటచే నిందేది సత్యమో తెలియకున్నది!"

"అతఁడు మాయత్తగారియొద్దఁ జెప్పిన మాటయే సత్యమగునదని తలఁతును. మఱియు నామెయొద్ద; నాయుద్వాసనకుండగు నుపాయము గావించులాగునఁజెప్పి కొంత బహుమానముగూడ నందెనఁట."

"ఇది నీవెట్లెఱుఁగఁ గలిగితివి?"

"అత్తగారు నాతఁడును మాటలాడుచుండ మనతారానాథసింగు చాటుననుండి వినెనఁట".

"కాంతా! నీ వే విషయమున భయపడకుము. దారినరుగు వారిమాటలెల్ల వినుటకేను నీగుణములఁ దెలియనివాఁడనా? అయినను నీకుమాత్ర మొక్క విషయ ముపదేశించెదను. అబిడ యేమనినను మౌన మవలంబించి యుండుము కొంతవడి కామెయే యూరకుండఁ గలదు. నేనొక రాజకార్యమునకై యమలాపురమున కరుగ వలయును. నేను వచ్చునంతదాఁక నీ వతి జాగరూకతతో మెలఁగవలయునది."

"దేవరవారి యానతి నీదాసురా లెప్పుడును దాటునది గాదు. కాబట్టి మీరాచింతమాని త్వరలో కార్యములు పూర్తిగావించికొని మరలి రావలయును".

"అట్లేకానిమ్ము—" అని యాడి వేంకటేశ్వరుఁడట నుండి కదలి తల్లియొద్దకు వచ్చెను. వచ్చినవాఁ డామెపాదములకు నమస్కరించి;

"అమ్మా! నే నొక రాజకార్యమునకై యమలాపురమున కరుగవలసి యున్నది. నాకు సెలవిమ్ము."

"అబ్బాయీ! నీవిచట నుండునపుడే మము లక్ష్యము సేయని నీభార్య నీవూర లేకున్నఁ జీటికిఁ గొనునే! కాబట్టి నీతోడ దానింగూడఁ బిలిచికొని పొమ్ము."

"అమ్మా!—ఊరూరును దిరుగవలసినవాఁడ నాఁడు దాని నెట్లు వెంటఁ గొనిపోవుదును?"

"నాయనా! ఏమిచేయమందువు! నీపాలఁబడినదానిని నీవుకదా భరింపవలయును? మొదటినుండియు దానికిఁ దోఁచిన పోకడలఁ బోనిచ్చుచు నీవూరకుండుటచే నీలాగునఁ గల్గెను. ఇప్పుడెంత చింతించినను లాభమేమిటి!"

"ఇప్పు డంతటి విపరీతస్థితి యేమిగల్గెను?"

"భోజనము వేళయందుఁగాని తక్కిన యప్పుడింట నిలువని నీకు దాని చర్య లెట్లెఱుకపడఁ గలవు? అబ్బబ్బా! దానితోడ నియింట నుండుట నాగుబాముతోడఁ గాఁపురము సేయులాగున నున్నది. అత్తనుజూచిన నలక్ష్యము సేయుచున్నది. ఆఁడుబిడ్డనుఁజూచిన నదరించుచున్నది. భర్త పేరెత్తినఁ బలువిధముల దూషించు చున్నది. ఈవిషయములు నీతోఁ జెప్పవలయునని పలుమాఱు తలంచితిని గాని నీ వెచ్చట నలిగి

దానిం దఱిమెదవో యని యూరకున్నాను. నేనూరకుండు కొలఁదియు దానిదుండగ మతిశయించు చున్నది. ఇంక నెత్తిఁ గింపకుండినఁ గార్యము చెడునని యెంచి యిప్పుడు తెలిపితిని. తండ్రీ! నీవును దొందరపడి కాఁపురమును బాడుచేసికొనకుము."

అని యిటు శేషమ్మ యాడినం తన వేంకటేశ్వరుని మానసము నించుక మార్పు నొందఁ దొడఁగెను. భార్యపైఁ గొంత సంశయించు చుండెను. మరల నాబిడ గుణములు జ్ఞప్తికి వచ్చుటచే నా సందేహము వాయుచుండెను. ఇట్లు సంశయ సంశయేతర మధ్యస్థుఁడై;

"ఆహా! సత్యవతీ! నిన్ను నిక్కముగ సత్యవతి వనియే ఇంతకాలము నిశ్చయించి యుంటిని. నేఁడుకదా యది వెల్లడి యాయెను! నీ దుశ్చేష్టము గప్పి పుచ్చునాయొద్ద నెట్టనక్క వినయము చూపుచుంటివి!

ఏమి యీ వెఱ్ఱి! నాయనుంగు చెలియగు సత్యవతిపై సందేహము కలుగుటయా! ఇన్ని దినములుగ దీని గుణము లెఱింగిన నేనిదినమిటులఁ దటాలున దోషారోపణము గావించుట పాడియగునా! మాతల్లికిఁ గోడలిపై ననూయ గల్గుట విదితపూర్వమేకదా! ఏకార్యమును విమర్శించి చేయుట తగవగును."

అని యెంచి యాతఁడు నాఁటిదినము ప్రయాణము మానికొనెను. శరీర మించుక యస్వస్థముగా నుండుటచే నాఁటి పయనమాఁపి కొంటినని తల్లితోడను భార్యతోడను జెప్పెను. గదిలోని కరిగి శయ్యయందుఁ బవ్వళించెను. 'మంత్రములేని సంధ్యకు మఱింత నీరనులాగున నసత్యరోగ

మున కమితమగు మూలుఁగుదయించెను. మాయతల నొప్పికి మందులు మెండయ్యెను. తల్లి యొక వైపునను భార్యయొక వైపునను నాసీనలై చింతించు చుండిరి. వేంకటేశ్వరుఁడును వారినిగాంచి;

"నాకీ రాజకార్యముల యందలి యలయికచే నించుక జబ్బుసేసెను. చక్కఁగ నిదురించినచో నీజబ్బు నివర్తి కాఁగలదు. కాఁబట్టి సందడిసేయక మీరరుగుఁడు."

అని యాతఁడాడినాతనే యత్తయుఁ గోడలు నట నుండిలేచి వెలుపలికి వచ్చిరి. సత్యవతి తన గదిలోని కరిగెను. శేషమ్మయు నింట వసారాలోనికి వచ్చెను. ఆమె వెంటనే జానకమ్మయు నచటికివచ్చెను. వేంకటేశ్వరుఁడును వారెటుఁగ కుంకులాగున, నడుగులు చప్పుడు వినఁబడకుండునట్లు తిన్నఁగ లేచి యావసారా కించుక దూరముననుండు గోడచాటునకు వచ్చి నిలునఁబడి యుండెను. అప్పుడు తల్లియును గూఁతురును మాటలాడువానిలో నీక్రింది మాటలు మాత్ర మతనికి వినఁబడినవి.

"రామచంద్ర............కాసులదండ............ ...మాయన్న........చాడీలు... ........ ద్వేషబుద్ధి ......తత్ఫలము.........త్యజించుట."

అను నీవాక్యములు వినినంతనే వేంకటేశ్వరుఁ డిట్లు చింతించెను. "ఓహో! వీరి సంభాషణ మూలమునఁ గొంచెము యథార్థము దెలియవచ్చెడిని. 'రామచంద్రశాస్త్రికి లంచముగాఁ గాసులదండను మన మిచ్చియుండుటచే నతఁడు మాయన్నయొద్ద నెన్నియో విధములఁ జాడీలు చెప్పియుండును. మావదినపై నాతనికి ద్వేషబుద్ధి కల్గింపఁగలఁడు. తత్ఫల

ముగా నాతఁడు భార్యను ద్యజింపఁగలఁడు.' అని యేర్పడును. అట్లైనచో సత్యవతి యాడికోలు వాస్తవము. ఒకవేళ 'రామచంద్రశాస్త్రికి లంచముగా మీయమ్మ కాసులదండ యిచ్చెను.' అని మాయన్నయొద్ద నెన్నియో విధముల మావదినచాడీలు చెప్పియుండునా? తన్మూలమున నతనికి మనపై ద్వేషబుద్ధి కల్గి తత్ఫలముగ మనల నతఁడు త్యజించుట గలుగునేమో' యనియును తర్కము చేసికొన వచ్చునుగదా! ఇంతకును జక్కఁగ విమర్శింపనిదే యేకార్యమును నిశ్చయింపఁదగదు"

అనియెంచి మరల శయన గృహమునకుఁ బోయెను. గాఢనిద్రితునివలె నభినయించుచుండెను. సత్యవతియు భర్తయొక్క శిరస్థితి విచారించుటకై లోని కరుదెంచెను. గాఢనిద్రాసక్తునిగ భావించి యాతని నిద్రకు భంగము గల్గించుట సరికాదని యెంచి, యడుగులు చప్పుడుగాకుండ గదినుండి వెలుపలికి వచ్చెను. సత్యవతి యిట్లు పదశబ్దము గాకుండ వచ్చుటచే ననుమానము మఱింత యధికము కాఁగ వేంకటేశ్వరుఁడును దిన్నఁగ లేచి యామె కెఱుకపడకుండులాగున నామెను వెన్నంటెనుగాని యామె తనగది కరిగి శయనించుటచూచి సందేహము మానెను. తానును దనగది కరిగెను.



ఎనిమిదవ ప్రకరణము.

## నాటక దర్శనము.



వేంకటేశ్వరుఁడు మాయనాణెములు ముద్రించుచుండు స్థలముగనుఁ గొననెంచి యమలాపురమున కరిగియుండెను.

కొంతకాలముగ రాకుండిన రామచంద్ర శాస్త్రియు నాఁటి దిన ముదయమున వచ్చి శేషమ్మతోఁ, "గాకినాడనుండి సత్యవతిని బిలుచుట కొకవర్తకుఁడు వచ్చియున్నవాఁడనియు, నాఁటి రాత్రి నాటక సందర్శనమునకు మీరెల్లరును వచ్చినచో నన్ని కార్యములును సులభముగాఁ జక్కఁబడును"ననియుఁ జెప్పి వెడలిపోయెను. తల్లియొక్క ప్రేరణచే జానకమ్మయు సత్యవతిపై మిక్కిలి ప్రీతిగలిగిన లాగున నటించు చుండెను. అమాయికురాలగు సత్యవతియు దీని విశ్వసించెను. ఊరికి వెళ్లిన భర్త యింకను రాకుండెను గదాయని సత్యవతి చింతించు చుండ జానకమ్మ యామె చెంత కరుదెంచి యాబిడ నూఱడించుచు;

జాన.—ఏదియో రాజకార్యముంట నాలసించుచున్న వాఁడుగాని యూరికిఁ బోయినవాఁడు రాక యట్టే యుండునా? ఈమాత్రమున కింత వగపేల?

సత్య. — అట్లనివార్యమగు రాచకర్జము లుండినఁ దమరాకునికిఁ దల్లిగా రెంత పరితాప పడెదరోయని యెంచి యొక లేఖ వ్రాయఁ గూడదే?

జాన.—తల్లిగారి పరితాప మటుండఁ బత్ని యనుభవించు దుఃఖము దుర్భరమనుట దెలియఁజాలకున్నాఁడుగా!

సత్య.—అమ్మా! నీ కెప్పుడును వేళాకోళము లాడుట సహజమైనట్లు దోఁచుచున్నది.

జాన.—నీ వ్యసనము దుస్సహమనుట నిక్కువమైనదియుఁ, బరిహాసమైనదియు నీకుఁ దెలియునుగదా?

సత్య.—నా పరితాపము నిశ్చయమైనను నీవాడుట పరిహాసమునకే యనుట నేఁ దెలియునిదానఁగాను.

జాన.—అదియటుండనిమ్ము. నేనిఁక నీవ్యసనముతోడ జీవించియుండుట కన్న బలవన్మరణము నొందుట మేలని తలఁచుచున్న దానను.

సత్య.—అమ్మాయీ! కాలమెుక్క రీతినుండఁ బోదు గదా? ఎప్పటికైనను మంచి కాలము రానోపును. కావున నట్టి యశ్లీలములఁ బలుకకుము.

జాన.—నేనేమి చేయుదును? మఱచిపోవుదమన్నను నాకీ దుఃఖము మఱపునకు వచ్చుటలేదు.

సత్య.—మన సన్య విషయాసక్తిము గావించినఁగాని నీకీ వ్యసనము విస్మృతముగా నోపదు. అట్లుఁ జేయకుండినచో నీ కెంతయుఁ గష్టము లుద్భవిల్లఁజాలు. అయ్యో! ఈస్వల్ప దినములలోననే నీమెుడ లెంత కృశించెనో తెలియకున్నావు!

జాన.—నీతోడు. నామాట నమ్ముము. నీపార్శ్వమున నున్నంతదనుక నాకే వ్యసనమును గోచరముకాదు. నినువిడచి యావలకుఁ బోయినచో వెంటనే నాకివాఙ్మానస గోచరమగు చింత యుదయించెడిని. ఇందుకేమి యుపాయ మాలోచింతును?

సత్య.—ఎల్లపుడు నను వదలకయే యుండుము. అప్పుడు నీకీచిక్కు దటస్థింపదుగదా?

జాన.—అట్లేయుండ నెంచుచున్నదాన? ఇఁక నితర విషయములలో మనసు పొచ్చునెట్లు?

సత్య.—నీ వనుదినమును గోదావరీ తీరమున కేఁగు చుండినచో నచ్చటి స్థలరామణీయకాదులఁ జూచిన నీచింత యించుక తొలఁగఁ గలదని దలఁతు.

జాన.—అనుభవము మీఁదఁగాని యెందుఁగల యుక్తాయుక్తముల నిర్ధారణసేయఁ జాలను.

సత్య.—ఉత్సవాదుల కప్పుడప్పుడుఁ బోవుచుందుము.

వీరిటు మాటలాడుచుండ నచ్చటికి శేషమ్మయు వచ్చెను. వచ్చిన యామె సత్యవతి యాడిన మాటలవిని జానకమ్మతో నిట్లనియె.

శేష.—బిడ్డా! సత్యవతి సెప్పుట సరియగునది. వేడుకలు సూచుచుండిన మానస మించుక శాంతిఁ బొంద నేర్చును. నేఁటిరేయి నీయూరికరుగు దెంచియుండు "గానోల్లాసినీ సమాజమువారు" పారిజాత పుష్పాపహరణ నాటకమాడఁ బోవుచున్నారు. దానింజూచి వత్తము.

జాన.—మన మచటికివెళ్ళిన వదినమాత్ర మిచ్చట నొంటరిగ నెట్లుండఁగలదు? నాకు నిప్పుడామెతోడిదె లోకముగ నున్నది గాన నేను నామెవీడి యెట్లు రాఁగలను?

శేష.—సత్యవతినిఁగూడఁ బిలచికొని పోయెదము.

జాన.—ఈసమయమున మాయన్నయ్య వచ్చియుండిన బాగుండెడి. అతఁడును. రాకపోయె. ఇఁక మనకచటికిఁ దోడై వచ్చుటకుఁ దగు పురుషులులేరుగదా?

శేష.—మగసాయమునకు మనకేమి లోటుగలదు? మన రామచంద్ర శాస్త్రిగారిని రమ్మనెదము. వారు మిక్కిలి పెద్దలు. సాధువులు నగుదురుగాదె?

సత్య.—పెద్దలగు శాస్త్రులవారు నాటకము చూడ నిచ్చగింతురా?

శేష.—దానదోష మేమిగలదు?

సత్య.—స్త్రీ పురుష వేష ధారిణి యైనను, బురుషుఁడు

స్త్రీవేష ధారియైనను జూడఁగూడదని పెద్దలు సెప్పుచుండ వినియున్న వారముగదా?

శేష.—ఈ సమాజమున నట్టిచిక్కులు లేవు. స్త్రీ వేషమునకు స్త్రీలును, బురుష వేషమునకుఁ బురుషులు నున్న వారలు.

సత్య.—మీ కుమారు లీదినమువచ్చిన బాగుండును.

శేష.—ఊర లేకుండఁగా నాటక శాలకుఁబోయిన నాతఁడేమి కోపగించుకొనునో యని భయపడెదవా?

సత్య.—భయపడవలసినది న్యాయమే కదా?

శేష.—నీ కాభయ మక్కఱలేదు. నామాటకాదని వాఁడేమిసేయును? నిను గోపముసేయకుండునట్లు నేఁజేయఁ జాలుదు. అమ్మాయీ! జెండమున కానందమునొసఁగు నీవేమిచేసి నను వానికిఁ గినుకపుట్టనేర దనుట నిశ్చయమని నమ్ముము.

సత్య.—అత్తా! మీమాటల కేను మాఱుపలుకు నంతటిసమర్థురాలనే?

శేష.—కావుననే నీతోడ నిట్లుఁ జెప్పఁగడఁగితిని. ఒరులతోనైన నే నిట్టి ప్రసంగములు సేయుదునే? ముసలి దాననైన నేనీబిడ్డను సంతోష పెట్టుటకొఱకే కదా నాటక శాల కరుదెంచుట కిష్టపడితిని. అట్లుండ నీకనీవుమాత్ర మడ్డు సెప్పఁగలవా?

సత్య.—మీయిచ్ఛచొప్పున నంతయు నొనర్పెదు. ఇందునకునన్నడుగ నేల?

శేష.—నీయాభరణములెల్లఁ దాల్చికొనుము. నడుమఁ దెచ్చిన యాపచ్చపట్టు చీర ధరింపుము.

సత్య.—సాధారణ పుటుదుపులు చాలవే?

శేష.—మీ మామగారుండిన గొప్పదనమునకును, నీమగఁడుండు నుద్యోగమునకును, నాగౌరవమునకును దగిన ట్లుండవలదే? ఇట్టి సామాన్యవేషముతోడ నిలువదలి బైలు వెడలుట మన ప్రతిష్ఠకు లోపమగుఁగదా ? మనకుఁ దగు రీతినుండనిచోఁ బరువునకు లోటుగల్గును.

సత్య.—'గత శ్రీః ప్రతిష్టాకామః' అనుట మీకుఁ దెలియనిదికాదు. అట్లుండ నిఁక నీపటాటోపములతోఁ బని యేమి?

శేష.--ఇక్కాలమున నాడంబర ముండిననే గౌరవము గల్గును. కాలానుసారము బోవలసినది యెల్లరకును భావ్యము.

సత్య.—భామలకుఁ బతులూర లేనప్పు డాభరణాదులు తగవని శాస్త్రములు సెప్పుచుండ నందులకు వ్యతిరేకముగ నడచికొనుట బాగుగాదని తోఁచెడిని.

శేష.—అవెల్ల నీకాలమునకుఁ దగినవికావు. ఆశాస్త్రముల కెల్ల నర్థము వేఱు. 'భర్తృదేశాంతరగతుఁ డైనపు డలంకారాదులుగూడ దన, దూరదేశ గతుఁడగు బతికేమి కీడుగలుగునోయను భీతిచే నలంకారము చేసికొన మనసొప్ప కుండును గావున నట్లొనర్పుమని చెప్పియున్నది. గాని యిచ్చటినుండి ప్రక్కయూరికి వెడలి మఱునాఁడు వచ్చులోఁగనే యిట్లలంకారాదులు లేకయుండ నలయుననుటగాదు.

సత్య.—పెద్దవారు మీరట్లు నుడివిన మీమాట కన్యథా సెప్పునంతటిదానను గాను. మీయిష్టము చొప్పుననే నడచి కొందును.

వీరిటు మాటలాడియైన తరువాత వారివారి పనులకు వారువారు వెడలిరి. ఆనాఁటి సాయం సమయమున సత్యవతి

యు జానకమ్మయుఁ జక్కఁగ నలంకరించుకొనిరి. భోజనాదు లఁజేసికొనిరి. తాంబూలము లధంచిరి. ఎనిమిది గంటలుకొట్టె ను. వాకిట గుఱ్ఱపుబండి వచ్చినిలచియుండెను. రామచంద్ర శాస్త్రియు నాతరుణమునకు సరిగనచ్చుటికి వచ్చిచేరెను. శేష మ్మయు చీనాదేశపు తెల్లని పట్టు వస్త్రము ధరియించె. వ్రేల నొక వజ్రపు టుంగరమును ధరించెను, తాంబూల ధారణము వితంతువులకుఁ గూడదను నుద్దేశమున నదివిడిచి యేలాలవం గాది సువాసితమగునట్టి పోక చెక్కల పొడుము పుక్కిటనిడికొని యుండెను. అంత రామచంద్రశాస్త్రి యామెచెంతి కరుదెంచి యిట్లనియె.

రామ.—అమ్మా! అలస్య మగుచుండ లేదా? వృథా కాల యాపనసేయు చుండిన నచ్చుటస్థలము దొరుకుట సంశ టము.

శేష.—మాకొఱకుఁ బ్రత్యేకస్థానముల ముందే యా యత్తపఱచి యుంచవలయునని చెప్పియుంటినిగదా! అట్లొ నర్చియుండినచో స్థలమేల లేకపోవును?

రామ.—మీయాజ్ఞచొప్పున నన్నివిషయములు సరి చేసి యున్నవాఁడ. అయిన నామిత్రుఁడగు నొక మహామ్మ దీయునకు స్థలముముందే యాయత్తపఱుప లేదు. వలన? మన ము శీఘ్రముగ వెడలఁబోయెదమేయనియుఁ బురుషులగు మే మెట్లైనను జోటుచూచికొని యాసీనులుఁ గాగలమనియు ధైర్యముంట నట్లుఁ జేసితి. కావున నే శీఘ్రముగఁ బోయిన గుంపుగూడకమున్నే మేము సుఖాసీనులు గాఁగలము.

శేష.—సరి. ఇఁకఁ గదులుదము.

అని తనకూఁతుంబిలచి ప్రయాణమున కాయితము

గమ్మన నామెయు నొక్కతూఱి యుడుపుల ధరించి యద్ద మునఁజూచికొని యది బాగుగ నుండమి, మరల నేఱొక యుడు పులధరించి మున్నుఁబోలె నాదర్శమునఁజూచికొని యది బాగుగ నుండమి మరల వేఱొక యుడుపులఁ దాల్చుచు నిట్లు పలుతడ వలు సేయుటచే వృథగాఁ బ్రొద్దుపోవుచుండె. శుభ్రముగ స్నానముచేసికొని, మంచి యలంకారములఁ దాల్చికొని మెఱుఁ గని యాజానకమ్మయు నీదిన మిట్లలంకారము చేసికొనుచుం డుటకు సత్యవతి యెంతయు నాశ్చర్యమునందెను. అంతఁ గొంతసేపటి కొకవిధమునఁ దన యలంకారములు పూర్తి యొనర్చికొని జానకమ్మయుఁ బ్రయాణమునకు సంసిద్ధురాలా యెను. సత్యవతి యంతకు మున్నె సిద్ధముగ నుండె. శేషమ్మ మొదట సిద్ధపడియుంట వీరందఱునువచ్చి వాకిట వేచియుండు బండి నెక్కిరి. శాస్త్రియు ముందువైపున నెక్కెను. బండి తోలువాఁడు గట్టముల నదల్చెను. పది నిముసములలోఁగనే బండి నాటకశాలన సమీపించెను. అంత రామచంద్ర శాస్త్రి దిగెను. బండిలోని ముప్వురాఁడువాండ్రును గ్రిందికి దిగిరి. శాస్త్రిగారు వారిచెంతకువచ్చి వారినాఁడు వాండ్రు గూర్చుండు తావునకుఁ దీసికొనిపోయి విడిచిపెట్టిరి. నాటకశాలయందు నూగింజ యెగురవేసినను గ్రిందికి రాలకుండునాగున నపరిమిత ముగ గుంపుగూడి యుండెను. తమలపాకుల యంగడి యొందు సమీపమున నుండ నందుఁ గొందఱు జనులు గుమిగూడి ; వీడెములఁ దీసి నమలు వారుగను బొగాకుఁ గొని బుక్కిట నిడు కొనువారుగను, జట్టల విలిచి పట్టువారుగ నచ్చటి జనులుండిరి. ఒకచోడఁ జక్రకేళీలఁ జేతనిడుకొని యాసీనులగు సామాజి కులం దరిసి 'యరఁటిపండ్లో యరఁటిపండ్లు' అని బాలురు గొంద

అమ్ముచుండిరి. నాటక సమాజమువారు మఱియొకటి యాటం దెలుపుటకొఱకుఁ గొన్ని కరపత్రము లచ్చటి సభ్యులకుఁబంచి యిచ్చుచుండిరి. ప్రేక్షకు లనేకులు తమ జేబులలోనుండి ఘటి కారము నెత్తి యెన్నిగంటలాయెనని చూచుచుండిరి. కడనఁ గూర్చొనియుండు సామాన్యజనులు ప్రొద్దుపోయెనని యెంచి నాటకమారంభింపమి కలిగి చేతులుచఱచువారుగ నీలల వేయు వారుగనుండిరి. ఇంతలోఁ బొమ్మిదిగంటలాయె. మొదటఁగల యవనిక నెత్తిరి. బాలురు గొందఱురుగు డెంచి శ్రవణానంద మిచ్చు కొన్నిపాటలఁ బాడిరి. ఆవల నాటకము ప్రారంభ మాయెను. నాటక పాత్ర లొక్కొకటి వచ్చుచుండ వాని వేషభాషల గుఱించియుఁ గంఠస్వరముల గుఱించియు, సం గీతజ్ఞానమును గూర్చియు; ప్రేక్షకు లొండొరులు, తర్క వితర్కములు సేయుచు నాయాపాత్రల గుణదోషముల విమర్శించు చుండిరి. ఆజన సమూహమున నొక బ్రాహ్మణుఁడు మాత్ర మెంతటి కష్టముననో యచ్చటి జనములలోనుండి తప్పిం చుకొనిపోయి యొక్కయెడ నొక్కసాహెబును సంధించెను. అప్పు డచ్చటి జనులెల్ల నాటక సందర్శనమునఁ దమచిత్త ముల నాయపత్తిఱచియుండిరి కాని వీరిరువు రేలకో యచ్చో టువాసి యేకాంతమునకుఁ జని యేమేమోమంతనము లాడు చుండిరి. అట్లు వారు మాటలాడికొనఁగనే బండి నొక్కటి సిద్ధ పఱచున ట్లాబాపఁడుచెప్పనట్లె యామహమ్మదీయుఁడు నొన ర్చెను. ఆవల వారెటకో వెడలిపోయిరి. వారి జాడఁజూడ నెద్దియో యొక గొప్ప యకార్యాచరణమునకు పక్రమించువా రని తోఁచుచుండెను. అతరుణముననే యచటి యూఁడువాండ్ర నుండి ముప్పురంగనలు వెలికివచ్చిరి. వారిలో నొక్కతె మై

మఱచి క్రిందఁబడనుండఁ దక్కిన యిర్వురా మెంబట్టుకొని వచ్చుచుండిరి.



తొమ్మిదవ ప్రకరణము.

# అపరాధ పరిశోధకుఁడు.



ఆహా! కాలచక్ర మేతీరునఁ దిరుగుచున్నది! మండల న్యాయమూర్తి కడుపునఁ బుట్టితిని. రక్షక భటాధ్యక్షునిఁ బత్నినైతి. భర్తయొక్క పూర్ణప్రీతికిఁ బాత్రురాల నయితిని. సత్యవతి వంటి సతీతిలకముగలదా యని నల్వురలో వాసిఁగాంచితిని. తుద కగతికనైతిని. నాయందు దయయుంచి మోతబీబీ, పూటకూళ్లయింట నన్నము పెట్టించుచుండినఁ దినుచుంటిని.

ఈబిడ కారుణ్యము నేమని కొనియాడుదానను! ఆనాఁడు హుసేనునకుఁ జిక్కి పరితపించుచుండ ఆవదలపాలు గాకుండ రక్షించెను. నాఁటినుండి నన్నెంతయుఁ బ్రీతితోఁ గాపాడుచున్నది. నాచరిత్రమంతయునువిని నాపై నెంతయుఁ గనికరము గలిగియున్నది. ఏమిచేసిన నేమిఫలము! భర్తను విడనాడికదా బ్రదుక వలసెను.

ఔను. ఆమెయు నాక్షేమము కొఱకే యప్పుడు భర్తయొద్ద కంపకుండెను. ఔరా! పాపమనియు లోకులెఱిఁగిన మానహాని యగుననియు నెంచక నీచుఁడగు నారామచంద్రశాస్త్రి నాపతి యమలాపురమునకు వెళ్లియుండు

తరుణమునఁ దన యిష్టముచొప్పున నన్ను హుసేనున కప్పగించెను మాయత్తగారు నందులకు సమ్మతించియుండెను గదా! మా వారూరికి రాఁగనే వారెట్టికొండెములు చెప్పియుండరు? అట్టియెడ నేను బయలుపడుట యుక్తముకాదని యెంచియే నను గుప్తముగ నీబిడ రక్షించుచున్నది.

ఇంతకు నేనానాఁడు నాటక సందర్శనమునకుఁ బోవకుండిన నిట్టివిపరీతము దటస్థించి యుండదుగదా! అచ్చటను దప్పిక వొడమ రామచంద్రశాస్త్రి దెచ్చిన క్షీరమునేల త్రాగితిని? దానమత్తు గల్గించునట్టి యౌషధమేదియో వైచి నాకిచ్చుట చేతఁగదా యిట్లాయెను! ఆయౌషధ ప్రభావమున నేకదా మఱునాఁడు కాకినాడలో మోతీబీబీ యింటికిఁ జేరునంత వఱకును మెలఁకువ గలుగకుండెను! దాని ప్రభావమున శరీరమున జబ్బుగలుగఁగా నీమోతీబీబీ చికిత్స చేయించుటచే నప్పుడావైద్యునిమూలమున నాయౌషధ మహిమను దెలిసికొంటిని.మాయత్తగారికిఁగూఁతుపైనఁ బ్రీతియుండిన నుండుఁగాక. నాపైనసూయ గలుగనేల? తనతనయయొక్క కాఁపురము పాడయిన లాగునఁ దనయుని కాఁపురమును జెడ వలయునా! అప్పుడు దనకు నష్టము రెండింత లనుట యెఱుఁగకుండెనుగా! ఈర్ష్యాళువులకు వివేకమెట్లువచ్చును?

మావారింకను నూరికి రాకుందురా! వారువచ్చియు నాపొలఁకువగనుఁ గొనకున్నారుగదా! కారణమేమి యుండ నోపును?— తల్లియుఁ గూఁతురు నొనర్చు కలహములు గాక వేఱేమి గలదు? మావారు నిన్నిదినములుగ వాస్వభావ మెఱిఁగియు వీరిమాటలకు లోఁబడుట యుక్తమా! అందు వారి దోషమేమి గలదు? "నబాధ నాత్పరాశక్తిః" అనుట

నిక్కవము కదా! ఇంతకును నావిధి నన్నిలాగున వేపించు చుండ నెరుల ననవేల?"

అని యిట్లొక నాఁటి యుదయమున నొకమేడపైని వసారాలో నొక యాసనముపై నాసీనయై, సత్యవతి పరిపరి విధముల నాలోచించు చుండెను. మోతీబీబీయు నాప్రదేశమున కరుదెంచి యుండెను. ఆబిడను జూచినతోడన సత్యవతియు నత్యంతా నంద యుక్తయై యాసనముననుండి లేచి యెదుర్కొని పిలిచికొని వచ్చెను. ఇర్వురు నాసనములపై నాసీనలయ్యిరి. అంతవారేవియో మాటలాడుచుండఁ నాప్రాంతమున దారిదోపి శ్లతిశయించుచున్నవను ప్రస్తావము వచ్చెను. అప్పుడు;

మోతీ!—సత్యవతీదేవీ! మీవా రీదొంగలజాడ గని పెట్టుకుగా నిచ్చటికివచ్చి యున్నారఁట.

సత్యా.—అమ్మా! వారిమోమొక్కతూరిఁ చూడ బుద్ధి పొడముచున్నది. మీ రిది తరుణము కాదనిచెప్పి యున్నవారు? నేనేమి సేయుదాన?

మోతీ.—మీరు మీభర్తగారిని జూడవలయునని యెంచినచో నేఁజెప్పెడి లాగున నాచరింప వలయును.

సత్యా.—అట్లే యొనర్తును. వేగమ యాయుపాయమును దెల్పుఁడు.

మోతీ.—మీరిపుడు పురుష వేషము పూనవలయును. వారిబస యీవీథిచివరనుండు పూటకూలియిల్లు. మీరచ్చటి కరిగి, సమయోచితముగ మాటలాడి తప్పించికొని రండు. వారించుకేని సంశయించకుండు లాగున ధైర్యము నవలంబించుఁడు. జాగరూకతగల్గి యుండవలయును. త్వరలో మరలిరండు.

అనియాడి లోనికరిగి మగవారి కనువగు నుడుపులం దెచ్చి యిచ్చెను. సత్యవతియు వానిందాల్చి యాబిడను వీడ్కొని యాయిలువిడిచి వీథిలోనికి వచ్చెను. తిన్నఁగ నాపూటకూలి యింటియొద్ద కరిగెను. ఆయింటి యధికారితోఁ దాను నాదినమున నచ్చటికి భోజనమునకు వచ్చులాగునఁ జెప్పెను. ఈబిడ యటనిటునటుఁ దిరుగుచుండెను. సత్యవతి యొక్క యాడంబరముంగాంచిన వేంకటేశ్వరుఁడు నెవ్వఁడో యధికారి వర్గమునం జేరినవాఁ డగునని యెంచెను; ఆబిడతో మాటలాడఁ దలఁచి నిజసేవకుని దారానాథసింగు నని పెను. అతఁడు దనయజమాను నాతని యామెయొద్దఁ దెల్పఁగనే యామె యాతని వెంట నచ్చటి కరుదెంచెను. వేంకటేశ్వరుఁడును వచ్చినయాబిడకొక యాసన మొసఁగి తానుం దన యాసనమున నమరెను.

వేంకటేశ్వర.—అయ్యా! మిమ్మిట్లు స్వతంత్రించి పిలిపించి నందులకు సాహసమును మన్నింప వేడుకొనుచున్నాఁడను. నేనీమండల రక్షక భటాధ్యక్షుఁడను. మిమ్ముఁ జూడ గొప్పయధికారులని తోఁచుటచే మీతో నించుక సేపు సల్లాపము గావింప వేడ్కగొని రావించితిని.

సత్య.—నేనొక సామాన్య నరుఁడను గాని మిమ్ము బోలె గొప్పయధికారి వర్గమునఁ జేరినవాఁడను గాను.

వేంకటేశ్వర.—ఆహా! మీవాక్ప్రౌఢిమ నప్పుడే వెలియిడుచున్నారుగా! నాయధికార గర్వమున మిమ్మిలాగునఁ బిలిపించితినని మీ రెంచితిరనుట తెలియుచున్నది. అట్లెంచ వలదని మిము మొదటనే ప్రార్థించితిని గదా!

సత్య.—నామాటల కర్థము గ్రహించి మీరీలాగున

సంశయింపనేల ? నేనునిక్కముగ సామాన్యుఁడనే యగుదును.

వేంకటేశ్వర. — అది యటుండనిండు. మీయునికి మనుకులం గొంత వివరింపనగు నేనిం దెల్పి నాకర్ణములఁదనియింపుఁడు.

సత్య.—నాయూరు సింహాచలము. చిత్రాశ్వుఁడని నానామము. నేనొక యపరాధ పరిశోధకుఁడను. ఈప్రాంతమునఁ గలయొక యపరాధిని గనిపెట్ట నరుదెంచితిని.

వేంకటేశ్వర.—అట్లని నాకును మీసహాయ మత్యంతావశ్యకము. నేనీ ప్రాంతమునఁ గల దారిదోపిడిగాండ్ర వెదుక నరుదెంచి నాఁడను. కానివారి పొలఁకువ దెలియుట లేదు.

సత్య.—మీకు సాయపడునంతటి వాఁడనని తమచిత్తమునకు వచ్చుట కేనెంతయు సంతసించితిని గాని యిప్పటి నాపూనినకార్యము పూర్తికానిది యన్యకార్యమునకుఁ బూనుటుచితముకాదు కదా !

వేంకటేశ్వర._మీకార్యము గొనసాగిన పిదపనైనను నాకు సాయపడవలయునని వేఁడుకొనుచున్నాను.

సత్య.—అపరాధులఁ గనిపెట్టుట నావిధియగు చుండ ఇందు నన్నింత వేఁడికో నవసరము లేదుగదా !

వేంకటేశ్వర.—చిత్రాశ్వుఁడుగారూ! మిమ్ముఁ జూచినది మొదలు ఒక విషయ మడుగవలయునని నాచిత్తము తొందరపెట్టు చున్నది. కాని మీరేమి తలఁతురో యని యావిషయము నడుగక యూరకున్నాఁడను. సెలవైనచో నడిగెదను.

సత్య.—బాగుబాగు. మీరడుగుటకు నాసెలవుగావలయునా? మీయిచ్చకువచ్చినలాగున నడుగవచ్చును. దేవర వారి యాజ్ఞాబద్ధుఁడనని భావించి నిస్సంశయముగా నడుగుఁడు.

వేంకటేశ్వర.— సరి. నెల్లూరుమండల న్యాయాధ్యక్షులగు వెంకటప్పలయ్యగారిని మీ రెఱుఁగుదురా!

సత్య.—నే నెఱుఁగను గాని తామీ మాట యడుగుటకుఁ గారణము తెలుప వేఁడెదను.

వేంకటేశ్వర.—వారు నామామగారు. వారికుమారుఁడు ప్రకాశమనువాఁడు పసివాఁడు. వయసుమాత్రము భేదపడుచున్నది కాని రూపమొక్కటే తీరున నున్నది. మఱియు నీపుంస్త్వ మొక్కటి లేకున్న నాభార్య సత్యవతికిని మీకును భేదమే యుండఁబోదు. కాఁబట్టియే నేనీలాగునఁ బ్రశ్నింపవలసెను.

సత్య.—అపరాధ పరిశోధకుల కనేక వేషములు ధరించుట యావశ్యకము. స్త్రీ వేషము ధరించియుండినచో, నీవే నాభార్యవని యందురు కాఁబోలు! ఎల్లప్పుడు నామెను స్మరించుచుండుటచే, మీకు స్త్రీపురుష వివేచనాశక్తి లోపించి లోకమెల్లఁ దన్మయముగాఁ దోఁచుచున్నదని తలఁతును. నేనీలాగున నాడితినని కోప పడకుఁడు. ఈ శాఖయందు దుద్యోగమున నమరినవారిల్లు విశ్లేషాసహిష్ణువులుగ నుండఁదగదనుట మీ మదికి గోచరించుటకు గానింత చెప్పవలసెను. ఇట్లు సత్యవతి యాడినంతన బదులేమియుఁ జెప్పలేక వేంకటేశ్వరుఁడూరక మౌన మవలంబించియుండెను. సత్యవతియు నాతని ముఖచిహ్నదుల మూలమునఁ దనపై నాతని కింకను బ్రేమ తగ్గలేదని గ్రహించెను. ఇంతలో నాయూరి రక్షకభటాధికారి యచ్చటి

కివచ్చెను. సత్యవతియును వేంకటేశ్వరుని వీడ్కొని తానుండు చోటున కరుగుచు నిట్లనితలఁచెను.

"నిక్కముగ నానాథుని కింకను నాపైఁ బ్రీతితగ్గకున్న యది. మామగారి దుర్బోధనలు పూర్తిగ మనసున నాటుకొనలేదు. కాఁబట్టి యెప్పటికైనను నేను మరల నానాథునను గ్రహము పొందఁగలను. ఈశ్వరుఁ డనుకూలించినచోఁ గాని కార్యము నొందుగలదా!"

అని తలఁచుచుఁ సత్యవతియు దనదారిఁ బట్టెను.



పదియవ ప్రకరణము.

# వివాహ నిర్ణయము



ఒక్కనాఁటి యుదయమున ధవళేశ్వరమునకూర నెలుపలఁ బాఱుచుండు గోదావరి గట్టున, ఆఁడువాండ్ర నీళ్లాటరేవునకుఁ గొంచెము దూరముననుండు నొకమావి తోఁటయందు రామచంద్రశాస్త్రి యొక చూతవృక్ష చ్ఛాయనాసీనుఁడై యిట్లాలోచనఁ దలఁపోయుచుండెను.

"పాపమా సాయబు నవస్థ శోచనీయము! వాఁడు ద్రవ్యము దారవోసి యీసత్యవతిని గొనెను గాని యది సార్థకము గాకపోయెను. అతనిపని నష్టటఁ బుట్టి మునిఁగినట్లాగున నాయెను. నిన్నటిదినమున దొంగ వెంకఁడు చెప్పునంతదాఁక నాకిది దెలియదు. అతని దుష్ప్రవర్తనముగాంచి యాగ్రహ

ము నొందిన యతని యక్క మోతీబీబీ వాని నిలువెడలఁదఁజేసె నఁట. చేతఁగొంత ద్రవ్యమునెత్తికొని యెచ్చటికైన నగిరి జీవింతమని యాలోచింపుచు, మన వెంకని మూఁకకుఁ జిక్కె నఁట. మూవారిది యపహరించినంతన బ్రదుకుదెరువు లేక వారితో నొకటఁను జేరెనఁట. తానొకటి దలఁచిన దైవ మొకటి దలఁచు ననట యీతనియెడ సరిపోవుచున్నది.

అది యటుండనిమ్ము. ఇంతవఱకును శేషమ్మయొద్ద నుండు ధనమునంతయు నపహరించి యాయెను. ఇంక వేంకటే శ్వరు నొద్దఁగల ద్రవ్యమును గ్రహింపవలయును. సత్యవతి యాడిన నాటకములు బాగ నేరని ననిక దా యూబిడ నమ్మించి తిని! ఇప్పుడు నాకాయింటఁ గొంత స్వాతంత్ర్యమలవడినది. వేంకటేశ్వరుని యీ వివాహ ప్రయత్నము కొనసాగినచో అప్పుడు పూర్ణ స్వాతంత్ర్యము గలుగును."

స్త్రీ యీలాగున నాలోచించుచుండగా, ఈతని కించుక దూరమున నిద్దరు పురుషు లిట్లు సంభాషించు చుండిరి.

చలమయ్యా! కృష్ణరావుగారి యింటఁ జరిగిన దొంగ తనమున కీతఁడు కారకుఁడగు లాగునఁ జెప్పితివే! ఆనేరమున కై యీతని నేల నిక్షక భటాధికారి యగు శేషాచలము నాయఁడుగారు పట్టుకున్నారు!"

"రంగరావుగారూ! ఈతనిపైనను మానసమే కానియింకను స్పష్టముగ దోషము బైలుపడ లేదుకదా! అదియునుగాక యీతఁ డింకను గొప్ప నేరములను జేసియున్నవాఁడని వారి మానస మునకుఁ దోఁచియున్నది. కాఁబట్టి యవి యెల్లను బైలుపడ నంతదాఁక ఇతనిని స్వేచ్ఛగా వదలుట మేలని యూరకున్నారు.' తామిప్పు డీతని వెన్నాడివచ్చుటకుఁ గారణమేమి ?"

"వేంకటేశ్వరుఁడుగారియింటజరిగిన సత్యవతీ తిరోధానమున కీతఁడే కారకుఁడని క్రొత్తగా మన మండలమునకు న్యాయమూర్తిగావచ్చిన వెంకటప్పలయ్యగారనుమానపడిరి. నే నపరాధ పరిశోధకుఁడను గాన నన్నీ విషయము గనిపెట్టమని సెలవిచ్చిరి. వారి యాజ్ఞ చేతనే రక్షక భటాధికారి యగు శేషాచలము నాయఁడుగారు నాకు సాయమునకై నిన్నంపియున్నవారు. నే నీ కారణముననే యీతని వెంట నంటివచ్చు చున్నాను.

"సత్యవతిగారి తిరోధానమున కీతఁడు కారకుఁడగు నని న్యాయమూర్తిగా రెట్లూహింపఁ గలిగిరి?"

"వేంకటేశ్వరుఁడుగారి యింటిసేవకుఁడు తారానాథ సింగను నతఁడు; రామచంద్ర శాస్త్రియును, వేంకటేశ్వరుని తల్లిగారును రహస్య సంభాషణ లాచరించునపుడు చాటుననుండి యప్పుడప్పుడు వినుచుండెనఁట. అతనికి వీరి సంభాషణములు బాగుగాఁ జెవినిబడకపోయినను వినినవానిలోనుండి యతఁడు చక్కఁగా నూహింపఁగల్గెనఁట. నాటక సందర్శనమునకు వెళ్లిన యామె గాన్పింపకఁ బోవఁగనే మఱునాఁ డాతఁడు శేషాచలము నాయఁడుగారి యొద్దకు వచ్చి, "తప్పక రామచంద్రశాస్త్రియే యామె యొక్క తిరోధానమునకుఁ గారకుఁడు. శేషమ్మగారికిని, జానకమ్మగారికిని సిది తెలిసియే జరిగినది. శాస్త్రియిప్పు డామె నెచ్చటనో దాఁచియైననుండవలయును. లేక సంహరించియైన నుండవలయును". అని చెప్పెనఁట. వెంకటప్పలయ్యగారు నెల్లూరుమండలమునుండి మనమండలమునకు దరుదెంచినంతనే శేషాచలము నాయఁడుగా రీవార్తను

వారి కెఱింగించిరట. అంత వారు నన్ని విషయములు గని పెట్ట నియమించిరి.''

అని యిట్లు వీరు మాటలాడుచు రామచంద్ర శాస్త్రి యుండు చెట్టున కించుక దూరమున దాగియుండిరి. ఆసమయమున గోదావరిలో స్నానముసేయుట కరుదెంచిన కొంద ఱాడువాండ్రిట్లు సంభాషించుచుండిరి.

సుబ్బమ్మ — ఏదినా! నిన్నటి వివాహ విషయమున నియభిప్రాయ మేమిటి?

రామమ్మ — అభిప్రాయ మేమియున్నది? పదునేని మిదేడులవఱకును బెండిలిసేయక రామానుజాచార్యులు; తన కూతు జయలక్ష్మి నట్టెనిలిపి యుంచిన నిట్టి దనకిష్టమైన వాని జేసికొనక యుండునా!

సుబ్బమ్మ — ఆహా! ఇది యెంతటి యన్యాయము! బ్రాహ్మణ్యమున భేదము లేక పోయినను శాఖాభేదము పాటింపవలదా! తూర్పునాటి వైష్ణవ కన్యకకును ఆర్వేల నియోగి యగువరునకును వివాహము జరుగుటయా! పట్టపరీక్షలో గృతార్థు డయినంతనే శాఖాభేద మక్కఱలేదా! ఇన్నిటికిని మూలకారణ మీబిడయు బట్టపరీక్షలో గృతార్థురా లగుటయేకదా! ఆడువారికి జదువు సెప్పించుటచే నిట్టి సాంకర్యములు గలుగుచున్నవి.

వెంకమ్మ — ఆడువాండ్రకు జదువు నేర్పినంతన లోక మోటి బోవునా యనియా నీయభిప్రాయము!

రామమ్మ — మీకూతురు కళాశాలలో జదువుచున్నందున మీకంత కోపము గల్గెగాబోలు! మీరు ముందే జాగ్రత్తపడి మీ మేనల్లునికిచ్చి కట్టిపెట్టుటచే నయమాయెను.

సుబ్బమ్మ.— దేశభాషలలో రెండు ముక్కలు నేర్చికొనిన చో చాలనుకదా! శిశుపోషణము, పాకనైపుణ్యము, వృక్షదోహదము మున్నగు కుటుంబపోషణమునకు వలయు విద్యలనేర్చికొను టావశ్యకము గాని యాంగ్లేయవిద్య నేర్చికొని వారేమి యుద్యోగములు సేయవలయునే?

వెంకమ్మ.—నీవుచెప్పుట సరికాదు. నేను ప్రవేశ పరీక్షలోఁ గృతార్థురాల నైతినికదా! ఇప్పుడు నేను భర్తతోఁ గాఁపురము సేయుచుండుటలేదా! కుటుంబపోషణమునకు వలయువిద్యలు నాకుఁదెలియకున్న వే! స్త్రీ లుద్యోగము సేయరాదని యేశాస్త్రమునఁ గలదు? మావారు చెన్నపురి నున్నత న్యాయస్థలమున న్యాయవాది వృత్తి నవలంబించి యున్నారు. నేను నచట నొక బాలికా పాఠశాలయందుపాధ్యాయినిగా నున్నదానను. మాయిరువురకేమైన లోటుగల్గినదే! కాఁబట్టి యాఁడువా రుద్యోగము సేయ రాదనుట యనుచితము.

రామమ్మ.—ఇంక రెండుసంవత్సరములలో మీకూఁతురు నల్లుఁడును బట్టపరీక్షలోఁ గృతార్థులు కాఁగలరు. అప్పుడు కదా యిది తెగదనుటఁ దెలియఁగలదు. చెన్నపురమునందుఁ గాపున మీయిర్వురకు నుద్యోగములు కుదిరి, కాఁపురముసేయుటకు వీలైనది. మీయల్లునకింక నెచ్చటనే నుద్యోగము చిక్కిన మీకూఁతురాతనితో నూరూరు తిరుగుచుండునో యుద్యోగము సేయునో చూచెదము కదా!

వెంకమ్మ.— ఆ సమయమునకుఁ దగులాగునఁజూచి కొందము. ఇప్పటినుండి మనకా చింతయేల?

శాంతమ్మ.—మత సాంకర్యమును గుఱించియు, స్త్రీ

విద్యను గుఱించియు మీ రీలాగునఁ జర్చించుచున్నారు. ఈనడుమన జరిగిన వర్ణసాంకర్యమును వినిన మీ రింకేమందురో?

వెంకమ్మ.—అదేమిటి?

శాంతమ్మ.—కాకినాడలో నొక మహమ్మదీయుఁడు బ్రాహ్మణ స్త్రీని వివాహమాడెను.

వెంకమ్మ.—ఇట్టి వింతనే నెప్పుడును వినలేదు. నీకివివరము తెలిసియుండినచోఁ దెల్పుము.

శాంతమ్మ.—ఈనడుమన మావారు రాజమహేంద్రవరమునకు వెళ్ళియుండిరి. అచ్చట నొక నాటక సందర్శనార్థమరిగిరఁట. అప్పుడొక తురక మైమఱచి పడియుండు నొక బ్రాహ్మణ యువతి నొక శకటమున వైచికొని పోవనుద్యుక్తుఁ డయ్యెనఁట. మావారదిచూచి యావిడ మేనఁగల నగల నపహరింప నెంచివాఁ డట్లు చేయుచున్నాఁడని యెంచిరి. వెంటనే వానిబండి నాఁపిరి. అంత నతఁడును, దానాయూరిలోని రక్షకభటాధికారియొక్క పుత్త్రుఁడయినట్లును దన్నాబిడ వరించి, భర్తను విడనాడి తన వెంటవచ్చెదనని చెప్పుటచే నామెను గాకినాడలోని దన మేనమామగారి యింటికిఁ బిలిచికొనిపోవుచున్న లాగునను, అచ్చట మహమ్మదీయ శాస్త్రానుసారము వివాహము గావించికొనఁ బోవునట్లును జెప్పెనఁట. పిదప మావారు 'తనుమున కేలయూరిలోని పెత్తన' మన్నట్లు తమ కేల యని తిరిగివచ్చిరి. వారే దీనిని నాకుఁ దెల్పిరి.

ఈ విషయములు వినుచుండిన రామచంద్రశాస్త్రికి గుండెలు దటదటఁ గొట్టుకొనసాగెను. ముఖము వివర్ణముగాఁ బొచ్చెను. తన గుట్టచ్చట బట్టబయలగునో యని భయపడఁ

దొడఁగెను. తుదకెచ్చటనో యుండు వానిమూలమున మహా మాయావియగు తన కెట్టి యాపదగలుగఁబోవునని యెంచి ధైర్యమునందెను. రంగరావును జలమయ్యయును రామచంద్ర శాస్త్రిననుసరించిపొమ్మని తానాశాంతమ్మ వెంటనాబిడయింటి కరిగెను. తక్కినయాఁడువాండ్రును స్నానాదికృత్యముల గావించికొని యిండ్లకరిగిరి. రామచంద్ర శాస్త్రియు నాయూరనుండు నొక పురోహితుని కూఁతురు వితంతువు దన్ను శరణుఁబొందుటచే నాబిడను వేంకటేశ్వరునకిచ్చి వివాహము సేయించు లాగున నేర్పాటు గావింప నెంచి, వారియింటికి నెడలెను. చలమయ్యయు నాతని కెఱుకవడ కుండ నాతని వెన్నంటివచ్చుచుండెను.



పదునొకండవ ప్రకరణము.

# ప్రతీక్షింపని యాపద



ఒకనాఁడొని పూటకూలియింట నొక గదియందు వేంకటేశ్వరుఁడును దారానాథసింగును నుండిరి. వారిరువురుఁ దక్క నింకెవరు నచ్చట లేనందున వేంకటేశ్వరుఁ డెన్నియో దినములనుండి యాతనితో నేకాంతమునఁ గొంత మాటలాడ నెంచియుండినవాఁడు కాఁబట్టి యాతనిజూచి;

వేంకటేశ్వర.—ఓయీ! నీయందుమాత్రము నా కింకను విశ్వాసము తగ్గకున్నది. కాఁబట్టి నిన్నొక యంశ మడిగెదను.

తారానాథ.—అజ్ఞాప్రతీక్షియగువానిపై నిట్టిసంశయ మేల?

వేంకటేశ్వర.—సత్యావతీ శీలమువిషయమున నీ యభిప్రాయ మేమి?

తారానాథ.—అయ్యా! పెద్దమ్మగారి యొక్కయు, ఆదుష్టుఁడగు రామచంద్రశాస్త్రియొక్కయు నుపదేశములు తిమమనసునఁ జక్కఁగా నాటుకొనియున్నలాగునఁ దోఁచుచున్నది. సత్యావతిమ్మగారియెడ నుండైన దోషములేదు. అమ్మాయిగారి కాఁపురము చెడుటయే పెద్దమ్మగారికి సత్యవతమ్మగారిపై నసూయగలుగుటకుఁ గారణమాయెను. అందుకుఁదోడుగ నీశాస్త్రియు దాఁపురిమాయెను. ఈతఁడు పెద్దమ్మగారియొద్ద లంచములు తీసికొనుచుండెడివాఁడు. అమ్మగారితిరోధానమునకు నీతఁడేకారణమని నానమ్మకము. పెద్దమ్మగారు, నమ్మాయిగారును శాస్త్రియును జేరి యీకార్యము నాచరించిరని నే నెంచుచున్నాను. నే నూరినుండినచోఁ గార్యము కొనసాగదని యెంచియే నన్ను గోప్రాంతున కనిపిరి.

వేంకటేశ్వర.—సత్యవతి యిప్పు డేమైయుండునని నీ యూహ?

తారానాథ.—ఈ స్త్రీ యాబిడ నెచ్చటనైన దాఁచియుండునని తలఁచెదను.

వేంకటేశ్వర.—సాహెబువెంట వెడలిన లాగున మాంసల్లిగా రాడుటకు గత మేమియుండును?

తారానాథ.—తమతప్పు బైలుపడకుండుటకుగా నావిడ యాడినమాట లెంతవఱకు విశ్వాసనీయములో యనుట తామే యాలోచించినఁ దేటపడఁగలదు.

ఈమాటవినిన వేంకటేశ్వరు డిట్లు తలపోయసాగెను.

"అత్తకుఁ గోడలిపై నసూయగలుగుటకు జానకి కాఁపురము సేయకపోవుటయే కారణమనుట నిశ్చయము. ఇంక సత్యవతీ శీలమునుగుఱించి విచారించవలయును. అయినను దాని గుణములు తెలిసిన నేనేల సంశయింపవలయును? అది పూతచరిత్రయేయగును. అట్లైన సత్యవతి యేమైయుండును? తారానాథసింగు చెప్పినలాగున రామచంద్రశాస్త్రిచే గుప్తముగావింపఁబడియుండునా? లేక సంహృతమైయుండునా? అట్లుగాక యొరునకెవ్వనికే నమ్మఁబడియుండునా? దాఁచియుంచిన నింతకాలముగ బైలువడకుండ నోపదు. చంపుటకు వారికంత ధైర్యముండఁజాలదు. ఇంక నెవ్వనికే నమ్మియుండ నోపును. ఎవ్వఁ డంత సాహసము చేసి కొనియుండును? నా విషయ మెఱిఁగినవా రేమను దీనినిగొనరు. పొరుగూరివాఁ డెవ్వఁడేని యుండనోపును. మాతల్లి 'సాయబు వెంట నిదిచనె' నని చెప్పుటచే విలిచినవాఁడు సాయబయియుండునని తలఁతు. ఆ ట్లని విలిచినవాఁడు దానికి భంగముగల్గింపకుండునా? పతివ్రతల కెప్పుడును భంగములు గల్గనేరవు. వీని కన్నింటికిని గారకుఁడు రామచంద్రశాస్త్రియే యని తలఁతును.

ఈశాస్త్రియెవ్వఁడు? శాంతయ్య నాకొక సందేహముకల్పించి వెడలెను. చెన్నపురమున వంచన చేసినయతఁడే మహామాయావియా! ధూమశకటమున నెక్కుటకుఁ జీటిదీసిన దాయోగియే యగునా? అతనికిని రామచంద్రశాస్త్రికిని ఎట్టి సంబంధముగలదు? ఒకవేళ ఆయోగులును, మహామాయావియు, శాస్త్రియు నొకవ్యక్తియే యగునా? శాస్త్రికి నాయింటిగుట్టు తెలియును. మహామాయావికిని దెలియును.

మయశంబర మారీచాదులనుగూడ నిజకార్యములం గెల్చు నాతఁ డెక్కడ? అచ్చటచ్చటఁ బురాణములు సెప్పుకొని బ్రదుకునట్టి యీశాస్త్రి యెక్కడ?—అట్లమాయికుఁడైన సత్యవతి తిరోధాన మీతఁ డెట్లు చేయఁగలిగెను? ఇప్పు డక్కార్య మీతఁ డాచరించెనని నిరూపించుటెట్లు? స్పష్టముగఁ దారానాథసింగు చెప్పుచుండ సంశయింపనేల? మా తల్లియు, జానకియు మాటలాడుచుండ వినవచ్చిన మాటలఁ జాడనుబట్టి చూచినను నా కతనియందే సంశయము గలుగుచున్నది.

ఇలుసేరఁగనే శాస్త్రినిబట్టి సందేహాస్పదమగువాఁడను నెపమునఁ బంధింతునా? దాన నాఁగల లాభమేమిటి? నిక్కముగ మహామాయావియే యాతఁడైనచో నీపాటి బెదరున కా చోరశిఖామణి యదరఁజాలఁడు. ఈతఁడు మహామాయావి కానియెడల నొకబ్రాహ్మణుని బాధించిన పాపమునకు నేను గుఱి యగుదును. మాతల్లిగారి మానసమునకును సంకటముగలిగించినవాఁడ నగుదును. ఈ స్వల్పపు టనుమానము నాధారముగావించికొని యట్టి సాహసకార్య మాచరించుట యయుక్తము. కాఁబట్టి కొంతకాల మాతనిచర్యలఁ గనిపెట్టి, ఆవల నుచితరీతి నాచరించుట యుక్తమగును.”

తారానాథసింగు నాలాగున నాలోచించుచుండు నా తనింగాంచి;

తారానాథ.—అయ్యా! ధూమశకటమువచ్చు వేళ యైనది. శీఘ్రముగ నిటనుండి కదలి చనవలయునుగదా! ఇంక నాలసించు టేల?

వేంకటేశ్వర.—ఓయీ! గుఱ్ఱపుబండి నొక్కదానిని గిరాయికి మాటలాడుము.

అంత వేంకటేశ్వరు నానతిచొప్పునఁ దారానాథ సింగును గుఱ్ఱపుబండి నొక్కదాని సద్దకుఁ గుదిర్చికొనివచ్చెను. దానఁబరుపును బెట్టియు నునిచెను. ఇంతలో నాయూరి రక్షకభటాధికారి యచ్చటికిరాఁగ నాతనితో మాటలాడుచు వేంకటేశ్వరుఁడును బండినెక్కుటకు వెలుపలవచ్చెను. వాకిలి దాఁటినంతన నూనెకుండతోడ గాండ్లవాఁడొకఁ డెదురు పడెను. వేంకటేశ్వరుఁడు నాఁటిపయన మాఁపఁదలఁచి ;

వేంకటేశ్వర.— శకునము సరిగాకున్నది. ఈనాఁటి పయన మాఁపుదమని యెంచెదను.

రక్షక.—అయ్యా! తమబోటివారు నిట్టి వెఱ్ఱినిబడుట కాశ్చర్యపడుచున్నాను. ఇవియెల్లను వట్టిబూటకములు. నాగరకశూన్యులగు మనప్రాచీనుల యాచారములుకదా యివి! ఈకాలమున వీనిం బాటించువారెవరు?

వేంకటేశ్వర.—అట్లెంచుట పొరపాటు. ప్రాచీనాచారములకు సాటియగున వేవియునులేవు. తప్పక యవి యనుష్ఠేయములే యగును.

రక్షక.—నేవీనినెల్ల విశ్వసింపను. పెక్కుతడవలు నేఁ బరీక్షించితిని. నాకట వానిమూలమున నెట్టికష్టములును గల్గలేదు. నేనొకప్పు డమావాస్యనాఁ డొక చోరుల గుంపును వెదకుటకుగా బయలువెడలితిని. ఇలువెడలఁగనే యొక వితంతు వెదుట వచ్చెను. నే నరుగవలసినస్థల మటవీమధ్యమగుటచే మావారెల్లరును నాఁటిపయన మాఁపికొనుమనిరి. వీరిమాటల నే సరకుసేయక వెడలితిని. ఇదివఱకెన్నియో

తడవలు ముహూర్తము చూచికొనియు, శకునములు చూచికొనియు నరిగినప్పుడు చిక్కని యాదొంగలగుంపు నోడు పట్టుబడియెను. "మనోజయంతు మాండవ్యః" అనుట తమ యెఱుంగని యంశమా! నిన్న శాంతయ్యగారు జెప్పినప్పటి నుండియు నాకును రామచంద్రశాస్త్రి విషయమున నను మానము హెచ్చుచుకొనియున్నయది. ఆలసించిన నాతఁడంతర్హితుఁడుగా వచ్చుననియు దోఁచుచున్నది.

ఈమాట లాలకించిన వేంకటేశ్వరున కేమిచేయుటకును బాలుపోవకుండెను. కొంతవడి కాలోచించెను. కార్యభారమాలసింపఁ దగినదికాదని మదిం బొడగట్టుటచేఁ గుదరకు వెడలుటకే నిశ్చయించెను. అపశకున పీడ వాయఁదలఁచి పొరుగింటనున్న బ్రాహ్మణు నొకనిఁబిలిచి. వానికొక రూప్యము దానముచేసెను. వెంటనే రక్షకభటాధికారియు, దానును గుఱ్ఱపుబండి నెక్కిరి, తారానాథసింగు మాత్రము బండిముందువైపున నెక్కెను.

ఆహా! దైవవిధి యెట్టివాని కలంఘ్యముకదా! వేంకటేశ్వరుఁడు బాల్యమునుండియు శాస్త్రమునఁ బూర్ణ విశ్వాసముగలవాఁడు ఎప్పుడు నార్యధర్మముల లంఘించువాఁడుగాఁడు. అట్టివాఁ డిప్పు డిట్లు తొందరపడుటకు దైవ ప్రేరణయే కాకున్న నింకేమి కారణమగును? ప్రత్యామ్నాయముగ నొక రూప్యము దానముచేసి నంతన తన ప్రభావము నది చూపకుండునా యనుటయుం దెలియక ఇట్లు వెడలుటకు విధివిధానమే ప్రధానమగు. ఇంతకును గానున్నది కాక మానదుకదా!

వీరటుల గుఱ్ఱపుబండి నెక్కి కొంత దూరమరిగిరి. అప్పు డెదుట నొక పెండిలివారి గుంపు కుతూహలము తోడవచ్చు

చుండెను. మధ్యమున సవారిలో దంపతుల నాసీనులఁగావించి, నానావిధ వాద్యత్రధ్వానములతో నరుదెంచు చుండిన వారిం జూచి, యాగుఱ్ఱము బెదరి కట్టుత్రాళ్లను ద్రెంపుకొని నేలపై కొరిగెను. బండియు విఱుగఁ బడెను. బండివాఁడును దారానాథసింగును ముందువైపున నుండుటచేఁ గ్రిందికి దూఁకిరి. రక్షకభటాధికారియు వెనువైపుననుండుటచే అతనికిని దూఁకుట సులభసాధ్యమయ్యెను. వేంకటేశ్వరుఁడు మాత్రము బండినడుమ నుండుటచే దూఁకుటకు వీలుబడనందున బండితోడఁ గ్రిందఁబడెను. ఆసందడి నెట్లో యెడమకాలు చక్రమున నిఱికికొనుటచేఁ గాలువిఱుఁగబడెను. మోకాటికి దిగువ నుండు యెమ్ముకవిఱిగి పైకి పొడిచికొనివచ్చెను. అందుండి రక్తము ప్రవహించు చుండెను. తారానాథ సింగును సమీపమునకువచ్చి యప్పటి యతిని స్థితినిజూచి పెద్దపెట్టున నేడ్వఁ దొడఁగెను. వేంకటేశ్వరున కప్పుడే స్మృతి తప్పుచుండెను. రక్షకభటాధికారి చెంతఁగల వేఱొకబండిని వేంకటేశ్వరునెత్తి పరుండఁబెట్టి యాయూరి వైద్యశాలకుఁ దీసికొని వెడలెను. అచ్చటివైద్యుఁడును వెంటనేశరీరమునకు సత్తువగల్గించుమందు నిచ్చి, యాతనికించుక నీరుపోయించెను; ఆతనినాడిని బరీక్షించెను; శరీరమున కుష్ఠము గల్గులాగున నేదియో ద్రవరూపము గు మందిచ్చెను. మరల నిద్రకల్గులాగున నొకమం దిచ్చి పరుండఁబెట్టెను. విఱిగిన కాలున కావల శస్త్రలకిత్సఁ జేసెదనని వచియించెను. రక్షకభటాధ్యక్షుఁడు నాతని వైద్యుని కప్పగించి తానరిగెను. తారానాథసింగును బూటకూలియింట భుజించుచు నావైద్యశాల యొక్క వసారాలోనుండ నిశ్చయించికొనియెను.

పన్నెండవ ప్రకరణము.

# ఆపన్నరక్షణము.



ఎదుట నొక యినుపమంచము. దానిపైఁ బఱచి యుండు శుభ్రమగు పరుపుపై నొక పురుషుఁడు కన్నులు మూసికొని పరుండి యుండెను. అతని యెదుటనుండునట్టి బల్లపై నొక యాఁడుది యాసీనయై యుండెను. ఆబిడకుఁ బ్రక్కన నొక చదరపు బల్లపైఁ గొన్ని మందు లుండెను. అతనికి నిర్ణీత కాల మతిక్రమింపక యౌషధ మొసఁగుట కనువగులాగున ఆవనిత చేతి నొక ఘటికారము నునిచికొని దానిని చూచుచుండెను. ఆమెయొక్క యప్పటిదుస్తులఁ జూచినఁ గ్రైస్తవ వనితయాయను సంశయ ముదయించులాగున నుండెను. ఆమె మోముగాంచిన హిందూవనిత యగునని దోఁచుచుండెను. శయ్యాగతుఁడగువాఁడు అప్పుడప్పుడు మూల్గుచుండెను. అతనికి నిబిడ యొనర్చు నుపచారముల మూలమునఁ గ్రమముగ శరీరమునఁ గొంచెము కొంచెముగా సత్తువగల్గుచుండెను. బాధావశముననైనను, ఔషధమునందలి వెగటుననైనను; అతఁ డెప్పుడేని మందుపుచ్చుకొనుట కిష్టపడకుండిన, అనునయించి యాతనిచే నామె యౌషధ సేవనము గావించుచుండెను. ఆబిడ యుపచారములకంటెను దేనెలొలుకు నాపలుకులును ప్రేమార్ద్రమగు నాకటాక్ష వీక్షణమే తన్నారోగ్యవంతునిఁ గాఁజేసెనని రుగ్ణునిభావము. జనకులేని, సహచరులేని, ఇంక నెట్టివారైనను; అంతటి ప్రీతితోఁ బరిచర్యలు

శేయఁజాలరనియే యతని యభిప్రాయము. వ్యాధిగ్రస్తున కాబిడపై ఇట్టిదని తెల్పవీలుగానిప్రీతి యొంచఁగల్గెను. అందులకుఁ గారణమాతఁ డెంత యూహించినను గోచరింప కుండెను. క్రైస్తవ వనితయను నాబిడకును హిందూ యువకుఁడగు దనకును; బూర్వ జన్మమునం దేట్టి సంబంధమేమండి తద్వాసనా వశమున నిట్టిప్రీతి జనించియుండ నోపునని తుదకుఁ దీర్మా నించికొని, యొకవిధముగ మనసును సరిపఱచికొనియెను. ఇట్లు కొంతకాల మావైద్యశాల యందుండిన యారోగి కించుక యారోగ్యము గల్గెను. కాని చక్కఁగా నడుచునంతటి సత్తువమాత్ర మింకను గలుగలేదు. ఆతరుణి యా తరుణమున నాతనిం గడు జాగరూకతతోఁ గాచుచుండెను.

అట్టియెడ నొకనాఁటి మధ్యాహ్న సమయమున నీబిడ గవాక్షములనుండి వాకిలివైపునఁ జూచుచుండెను. మార్గమున నిర్వురాఁడువాండ్రు పోవుచుండిరి. వా రత్యంత మలినవస్త్ర ములఁ దాల్చియుండిరి. వారిం జూచినంతన ఈబిడ యేలొకో నివ్వెఱపడి యట్టే చూచెను. వారి యప్పటి యాకృతులు గాంచి, యప్పటి దరిద్రస్థితి నూహింపఁ గల్గెను. భూతదయా పరురాలగు నాయువిద వారియెడ జాలిగొని వీథిలోనికి వచ్చి యొక సేవకునిబంపి వారిం బిలువనంపెను. ఆవనిత లిర్వురు నా సేవకునితో నటకు వచ్చిరి. వారిలో నొక్కతె యించుక వయసు ముదిరిన యాబిడ. రెండవయామె యౌవనవతి. వా రటకిరు చేరఁగనే వాకిలివైపున నుండువసారాలోని బల్లపై వారిం గూర్చుండ నియోగించి వారి యునికి మనుకులం గనుం గొను తలంపుతో;

"వనితలారా! మీదేయూరు! ఇటకు రాఁగతమేమి?

మీ మోములం గాంచిన మీరొక గొప్పయింటివారని తోఁచె డిని. అట్టివారిట్టి వస్త్రములు ధరించి, వీథుల వెంట నలయనేల?" అంత వయసుముదిరిన యాబిడ కన్నీ స్రవవనితం జూచి;

"అమ్మా! మాయది రాజమహేంద్రవరము. మీరు దలఁచినలాగున మేము గొప్పకుటుంబమువారమే. నేను మండలా రక్షక భటాధ్యక్షునకుఁ దల్లిని. ఈ యువతి నాకూఁతురు. నా కుమారుఁ డీయూరికి వచ్చినవాఁడు బండినుండి పడి కాలువిఱిగి వైద్యశాల నున్నవాఁడని తెలియుటచే నాతనిం జూడవచ్చితిమి. దారిని దొంగలు మమ్ము గొట్టి మాయొద్ద నుండిన నగలును ద్రవ్యము నపహరించిరి. మాకీమలిన వస్త్రముల నిచ్చిరి."

"అమ్మా! మీరు అంతవాండ్రగుటచే ధూమశకట మార్గమున రాక యిట్లు బండిబాటను రానేల?"

"గృహచ్ఛిద్రములు గుప్తములుగానుంచుట బాగని నేఁ జెప్పకుంటిని. దాని నరుగువారి నిట్టివ్యాజ ప్రేమచే మీరు బిలిచి నప్పటినుండియు మీయెడ నిట్టిదని తెల్పరాని యొక యాదరభావము మా కుదయించెను. దాన మీప్రశ్న కుత్తరమొసఁగెదము, వినుఁడు. మాయింట రామచంద్రశాస్త్రి యనువాఁ డొక పౌరాణికుఁ డుండెను. అతని మేము మిక్కిలి యాప్తునిఁగా భావించియుంటిమి. వాఁడొక దొంగల ఱేఁడు. మేమావిషయ మించుకయు నెఱుఁగక యాతనియెడ నెంతయు విశ్వాసముంచి యుంటిమి. మా యింటికార్యములు అతని కెఱుకపడక యేదియు జరుగుటలేదు. అతఁడు మావాఁడూ లేకుండుటగని యొక్కనాఁటి రేయిని మా యింటికిఁ గన్నము పెట్టించి, తనవారింజొప్పించి, ధనమెల్ల నప

హరించెను. అందుమూలమున ధనరహితలమై చేతనుండిన కొంతద్రవ్యము నెత్తికొని ధూమశకటముమార్గమున వచ్చిన ఆ స్వల్పద్రవ్యముగూడ వ్యయమగునే యనియెంచి యిట్లు కాలిబాటనే వచ్చితిమి. కన్నపుదొంగ లారేయి మాచెంతకు రాక, ఇంటిలోని సర్వస్వమును దోఁచికొనిపోవుటచే, మా యొద్దనుండిన స్వల్పద్రవ్యమును, గొన్నినగలును మిగిలి యుండెను."

"మీ కంత విశ్వాసపాత్రమగు నాశాస్త్రి యట్టి యకృత్యమాచరించుటకుఁ గతమేమి?"

"ఆవిషయము తలఁచుకొలఁది మామానసములు మండుచున్నవి. అయినను జెప్పెదను. నాకుమారునకు వివాహము గావింప నెంచి యీతనితో, నెచ్చటనైన యుక్తసంబంధ మారయుమని యుంటిని."

"మీకుమారున కింకను వివాహముకాలేదా!"

"వివాహమైనది. అది భవ్యురాలుకానందున రెండవ వివాహము గావింప నెంచితిని."

"ఇప్పు డాబిడ మీతోడ నేల రాలేదు."

"అది పుట్టినింటికి వెళ్లెను. అయ్యో! దానిగొడవ యేల? అదియుండనిమ్ము. ఈశాస్త్రి వివాహము చేయించెద నని చెప్పి ధవళేశ్వరమున నొక కన్య నేర్పఱచికొని వచ్చెను. అది వితంతువు."

"వితంతూద్వాహము జరుపరాదని మీమతమునఁగల దని వినియుంటినే. మీ రద్దాని నె ట్లంగీకరించితిరి?"

"నా కది విధవయగుట తెలియనందున నియ్యకొంటిని."

"తుదకది మీకెట్లు విశదమాయెను?"

"ఊరును బేరును లేక యొకయుత్తరము నాకందినది. దానంజేసి నేనావిషయ మెఱుఁగఁగలిగితిని."

అని తనచెంతనున్న జాబు నాపెద్దయాబిడ క్రైస్తవ వనిత చేతికిచ్చెను. అందీవిధమున నుండెను.

రాజమహేంద్రవరము

భాగీరథీసమానురాలగు శేషమ్మగారికి,

రామచంద్రశాస్త్రిమాట మొదటినుండియు నమ్మి మోసపోవుచున్నారు. ధవళేశ్వరమున మీకుమారుని వివాహమునకై నిశ్చయించినకన్య విధవ. దానితండ్రియొద్ద నాల్గువందలరూప్యము లాతఁడు లంచము పుచ్చుకొని యున్నాఁడు. ఆవివాహమైన మీకుమారుని దన యధీనము గావించికొని యతనియొద్దనుండు ద్రవ్యమునెల్ల నపహరింపవచ్చునని యాతని యాశయము. ఇంతకాలముగా వైదికనిష్ఠతోనుండిన మీరు తుదనిట్టివివాహముగావించి యిహపరదూరులు గాకుందురని మిము హెచ్చరించుచున్నాను.

ఇట్లు,

మీ శ్రేయోభిలాషి.

ఈజాబునందలి యక్షరములు ముత్తియములుగూర్చిన లాగున సొంపుగనుండెను. ఇదిచూచినంతనే ఆ యువతి కవాఙ్మానసగోచరమగు నానందముదయించెను. అంత నాబిడ;

"ఇది తెలిసి మీరాతని 'నిది సాహస'మని యాడి యుందురు కాఁబోలు!"

"నా యీఁడుబిడ్డను ధవళేశ్వరమునకుఁబంపి యాజాబులోని విషయ మెంతవఱకు నిశ్చయమనుట విచారించితిని. అది

సత్యమగుట తెలిసెను. మఱునాఁడు శాస్త్రి యింటికిరాఁగనే యాతని, 'నీవెంతయో గొప్పవాఁడవని యెంచినందులకు విధవను నాకుమారున కంటగట్టఁజూచితివిగదా! ఇది చాలును. ఇంక మాయింట నడుగిడకుము.' అని నానాభంగుల దూషించితిమి. అంత నతఁడు కోపించి; 'సద్బ్రాహ్మణునినన్ను దూషించినందులకుఁ బ్రతిఫలము కొన్ని గడియలలోపుగనే మీకుఁ దెలియఁగలదని చెప్పి వెడలిపోయెను. నాఁటిరేయి నీదొంగతనము జరిగెను. అమ్మా! అది యట్లుండనిమ్ము. మాపై నింత యవ్యాజప్రేమంజూపిన మీరెవరో తెలుపవేఁడెదము."

"నేనీవైద్యశాలలోనుండు వ్యాధిపీడితులఁ బోషణకై నియమింపఁబడినదానను. మీకుమారులు నిట నున్నవారు. వారిపుడించుక యారోగ్యము నందియున్నారు. విఱిగినకాలును సరిపడియెను."

"తల్లీ! మావానిం జూడ నుత్కంఠ యతిశయించి యున్నది. అద్దాని కనుమతినొసఁగుఁడు."

"అమ్మా! మీరెంతయు నాఁకట బడలియున్నవారు. ముందు భోజనముసేయుఁడు. ఆవల మీకుమారునిఁ జూపెదను. వారిపుడే యాహారము భుజించి యించుక గూర్కొందియున్నవారు. ఇంతలోన వారును నిద్దుర మేల్కొనఁగలరు."

అనిచెప్పి యొకభటు నెటకోయంపెను. వాఁడును గొన్నినిముసములలోన రెండుచీరలఁ దెచ్చియిచ్చెను. అందొక్కటి యెఱ్ఱనియంచులుగల తెల్లపట్టుచీర. మఱియొకటి వెలపొడుగుజలతారు చీర. వీనిం ధరింపవలయునని యాగంతుక

1594214

లతో నావనిత యనెను. ఇంతదనుకను జేయిచాచిన వారు కారు. కాఁబట్టి వారించుక యాలసించిరి. క్రైస్తవ వనితయు వారలఁగాంచి;

"మీరుమూరునొద్ద ఈమలిన వస్త్రములఁ దాల్చి మీరేఁగుట సరికాదు. ఇట్టివేషము వారుగాంచిన వారి మనసు కలఁత నొందఁగలదు. ఈతరుణమున వారికెంతయు నుత్సాహము గల్గించవలయుఁగాని మానసమున కించుకైనను దుఃఖాదులఁ గల్గింపఁజనదు. అది యపాయకరమగును. కాఁబట్టి ముందీవస్త్రముల ధరింపుఁడు."

అంతఁ జేయునదిలేక వారావస్త్రములం గ్రహించిరి. ఆబిడ చూపిన దారినే యచ్చటనొక గదికరిగి యావస్త్రములఁ దాల్చివచ్చిరి. వెంటనే యొకసేవకునితోడ వారిని బూటకూలియింటఁ కనిపి, భుజింపఁజేసెను. అంత వారిని వేంకటేశ్వర్లుఁడుండు చోటునకుఁ బిలిచికొని వెళ్లెను. అతనిని జూచినవెంటనే యావృద్ధవనిత కాఁపరాని దుఃఖముకలిగెను. కన్నులవెంట బాష్పధారలు గాఱుచుండ 'హా' యని యేడ్వ దొడఁగెను. ఇంతలోనన ఆక్రైస్తవవనిత యాబిడను గోపించి యారోదనధ్వనిని మాన్పెను. వేంకటేశ్వర్లుని మనసెచ్చటఁ గలఁతనొందెనో యని ఆతని కుత్సాహముగల్గులాగున ద్రాక్షారిష్టమించుక యిచ్చెను. వృద్ధయుఁ దానాచరించినది సరికాదనుట యెఱిఁగి తనవ్యసనము నెట్లో యాఁపికొనెను. కుమారుఁడును దల్లిగారియొక్కయు, నాదరియొక్కయు యోగక్షేమము లారసెను. అవృద్ధయు "నినుఁజూడ నెంచివచ్చితి" మని యాడె నంతియుగాని తక్కిన విషయముఁ జెల్పలేదు. నాఁటి మొదలు కొంతకాలమువఱకును భోజనవేళలందక్కఁ దక్క

నపుడెల్ల నాకై క్రైస్తవ వనిత తోడన వారుండిరి. ఆబిడ యొన
ర్చు పరిచర్యలకు వేంకటేశ్వరునితోఁబాటు వారు నత్యంతసంతు
ష్టులైయుండిరి.



పదమూఁడవ ప్రకరణము.

# కాళికావిగ్రహము.



సత్యవతి యిప్పు డత్యంత సంతుష్టాంతరంగ యయ్యెను. ఎట్లును భర్త తనపైఁ బ్రీతిగల్గియున్నవాఁడనుట యాతని మూలముననే యెఱిఁగియుండెను. కాఁబట్టి యాబిడ మిక్కిలి యుత్సాహముతో నడుచుచుండెను. రాజమహేంద్రవరమున నున్న యప్పగారియొద్ద కరుగ ధూమశకటముండినను దన్న ప్పుడే యావిష్కరించుకొనుట యామెయిష్టముకాదు కాఁబట్టి కాలిబాటను బోఁజొచ్చెను. అప్పుడామె యేఁగున దొకయర ణ్యమధ్యము, నిర్మానుష్యమగు నాయడవి నడుమను నిర్భ కయై తా నొంటరిగ నరుగుట సాహసమేయగునని యెఱుఁ గునుగాని దైవ మొక్కటి చేయూఁతయుంటఁ దక్కినవాని నాబిడ సరకుసేయకుండెను. కంటకశిలావిశంకటమగు నాకాం తారమున నాబిడ యొంటరిగ నడచుచు నిట్లని తలపోయు చుండెను.

"క్రూర మృగశరణ్యమగు నీయరణ్యమును దాఁటుట మిక్కిలి కష్టతరమని నాఁడే మోతీబీబీయాడెను. అపవాదము

లకుఁబాలై భర్తృవిరహితనై యుండు నా కీజీవనమే భార ముగఁ దోఁచుచుండ నీక్రూర జంతువులవలని భయము నా కేల జనించును? ననుజూచినంతనె, ఈ పాపాత్మురాలి భుజించు టయుఁ బాపావహమనియెంచి కాఁబోలు, ఇదె యీవ్యాఘ్రా దులు సమీపింపక పాఱిపోవుచున్నవి. క్రూర సత్త్వములకును వెగటుగఁ దోఁచునట్టియీనునుగడ కేవలము భూభారము కొఱకే యగును. అనన్య ప్రార్థ్యమగు మృతియును నాయెడ ననుగ్రహ ముంపకున్నదిగా!"

ఈబిడ కీచింతచే మానసము స్వవశముగాకుండెను. దానఁదానరుగు దారి తెలియక మాఱుబాట నేఁగెను. అయ్యె దియొక యిరుకుదారి. దానికిరువంకలను దుమ్మలు దండిగ నుండుటచే ఇంచుక యశ్రద్ధ వహించినఁ గంటకక్షతి నాకుల యగులాగున నుండెను. దైవవశమునఁ గాకుండెఁ గాని లేకున్న నీపఱకే యీబిడ శరీరము రక్తమయమై యుండెడిది. దైవము పైభారము వైచి ఇట్లన్యమనస్కయై యరుగుచుండు నీబిడ కొంకింతదూరమున ఈలచప్పుడు వినవచ్చెను. ఇదివినిన సత్య వతియు;

"ఇదిక్రూరులగు దారిదోపిడి గాండ్రకు నెలవగు ప్రదే శము. మరణమునకు వెనుదీయకున్నను మానహానికి జంకవల యు. ఈ చుట్టుపట్టుల దొంగలు దిరుగాడు చుండుటచేతనే యీలవినవచ్చి యుండనోపును. ఇప్పుడేమి సేయనగు? ఎవరు శరణుఁ గాఁగలరు?"

అని యెంచుచుండ నెదుట నొకపాడుకుటిల్లు గన్ప ట్టెను. తామసించుట తగనిపని యనియెంచి, వెంటనే యందుఁ జొచ్చెను. అట నొక కాళికా విగ్రహముండెను. మూఁడుగజ

ముల పొడవును, అఱుగజము నిడుపునుగల యది శిలావినిర్మితము. దాని కెనిమిది భుజము లమరియుండెను. అదిచూచి నంతనేతా నద్దాని మఱుఁగుచొచ్చి యప్పటి యాపద గడప వచ్చునని యెంచెను. ఆలసింపక తత్క్షణమే యద్దేవి వెనుక కరిగి దాఁగియుండెను. ఇంతలోన నెవ్వరో వచ్చుచున్నలాగున నడుగుల చప్పుడు వినవచ్చెను. ఆచప్పుడు విని నంతనే, ఆదేవి నారాధించుటకై వచ్చెడి దొంగలే వారగుదురని యెంచెను. ధర్మ సంస్థాపకు రాలగు నాశక్తి వీరినింకను నశింపఁజేయ కుండుట కాశ్చర్యమంది యిట్లని తలఁచెను.

"ఈ మహాశక్తి యిట్లుదాసీన యగుటకుఁ గతమేమి? వీరి యవసానకాలము నెదురుచూచు చున్నదని యెంతును. ఓజగన్మాతా! నీమఱుఁగు చొచ్చిన నను నీవు గాపాడుచు దుష్టులగు వీరిని శిక్షింపుము. వీరు దేశము నెల్లఁ గొల్లకొట్టినాశము గావించుచున్నారు. ఇట్టివారి నధికారుల చేతికిఁ బట్టియిమ్ము. సర్వమంగళయను నామముగల నీవీయమంగళాచారులగు దేశద్రోహులఁ గాపాడుట పాడిగాదు. నాప్రార్థన మాలకించుము! వీరిమూలమున నెందఱెందఱు పాడైపోవు చున్నవారలు! అట్టియెడ నీవిట్లౌ దాసీన్యము చూపఁదగదు. వెంటనే వీరిం దుదముట్టింపుము. ఓ శిలావిగ్రహమా! నిక్కముగ నీయందు మహిమయున్నచో వీరప్పుడే నశించి యుందురు. కాఁబట్టి సాధారణ శిలలకును నీకును భేదము లేదని తలఁచు చున్నదానను. నిశ్శక్తికమగు నొకఱాతిని వేఁడికొనిన నేమి యుపయోగము? నీవాకాళియేయైనచో నాయీప్రార్థన మాలకించి వీరికిందగు దండన మాచరింపుము."

అని యావిగ్రహమును బ్రార్థించుచుండ నల్వురు మను

ష్యులటకు వచ్చిరి. వారిలో నొక్కఁడు దీర్ఘకాయుఁడై, పొడవునకుఁ దగినంతలావును గల్గియుండెను. వాఁడే దొంగ వెంకఁడు. వాఁడే వారిలోఁ బ్రధానుఁడు. వానిప్రక్కన బానవంటికడుపు గల్గి, నెరసిన వెండ్రుకలతో నొక్కరుఁడుండెను. వాఁడే మల్లయ్యసెట్టి. మాయారూప్యముల ముద్రించునట్టి యాలయమునకు వాఁడధికారి. వాఁడుచూచి సరియని చెప్పినఁగాని యొక్క రూప్యమైనను వెలికిరాఁజాలదు. వాని యెడమవైపున నొక పొట్టిసాహెబుండెను. వాఁడే యబ్బుల్ కరీము. ఆముద్రణాలయమునఁ గ్రొత్తగా నెవ్వనినైన నేర్పఱపవలసినను, నున్నవాని దీసివేయ వలసినను వాని యానతిమేరకే జరుగవలసియుండెను. వానిప్రక్కన మఱియొక మహమ్మదీయుఁ డుండెను. ఈతఁడే హుసేను. దొంగలకుఁ జిక్కి ధనము గోలుపోయిన నాఁటినుండి బ్రదుకుదెరువు తెలియక వీరిలోఁ గలసియుండి, ఇప్పుడు దారిదోపిడిగాండ్రకు నాయకుఁడై యుండెను. పై మూవురును దొంగవెంకనికి లోఁబడి యుండవలయునని మహామాయావి యాజ్ఞ.

సత్యవతియు నావచ్చినవారిం గాంచెను. వారిలో హుసేనుండుటం జూచి చిక్కిలి వింతవడెను. వాఁడు వారితోఁ జేరుటకుఁ గారణ మాభిక్ష యెంతయాలోచించినను మదికిఁ బొడఁగట్టకుండెను. అప్పుడు వాండ్లు సంభాషింపఁ దొడఁగిరి.

వెంక.—అయ్యలారా! నేఁటివఱకు మహామాయావి సెట్టియధికారులును బట్ట పీలుగాక పరితపించుచున్నారు. అతని మహిమచేతనే కదా మనమిన్నిదినములుగా సుఖమున్న వారము! ఇప్పుడాతనికొక్క యిడుమ వాటిలనున్నది. దాని నీమహాశక్తియే తప్పింపవలయును.

అబ్దుల్.—అయిక్కటిటిదియో తెల్పుము.

వెంక.—ఈనడుమన ఒకస్థలమున జరిగిన దొంగతనమున కీతఁడే కారకుఁడనియెంచి ఈతనింబట్ట నధికారులు ప్రబల ప్రయత్నము సేయుచున్నవారు.

అబ్దుల్.—ఇన్నిదినములుగా నీతనిం బట్టవలయునని యెంద ఱెన్ని ప్రయత్నములు సేయలేదు! అవియెల్లను ఫలించినవియా! ఈమాత్రమునకే మన మీలాగున భయమంద నవసరము దోఁచుటలేదు.

వెంక.—కాలమెప్పుడు నొక్కరీతి నుండఁజాలదు. కీడెంచి మేలెంచవలయును. ఇంతకును ఈజగన్మాతను మనము శ్రద్ధాభక్తులతోఁ గొలుచుచుండినచో మన కార్యములు నిర్విఘ్నముగాఁ గొనసాగఁగలవు.

హుసేను.—మీయట్టివారును, ఈ రాతిబొమ్మను విశ్వసించుటచూడ నాకాశ్చర్యము గల్గుచున్నది. ప్రాణవిహీనమగు నీబొమ్మయే మనల రక్షించునెడల నింక మనశౌర్యమును ...కచక్యమును వ్యర్థములే యగును.

వెంక.—ఓయీ! నీవిట్లు దేవిని దూషించుచుండుట తగదని నీ కిదివఱకెన్నో తడవలు సెప్పియున్నాను.

హుసేను.—మీరెంతచెప్పినను బురుషప్రయత్నమునకంటె నేదియు నధికముకాదని నానమ్మకము. అందు నీ యచేతన మొదులకును గొఱగానిదని నాదృఢ నిశ్చయము.

మల్లయ్య.—బాబూ! నీవట్లాడకుము. అదె యాశక్తి మనకిప్పుడు ముకినిచ్చులాగున నుగ్రమూర్తియై కాన్పించుచున్నది. వెంకయ్య బాబూ! అట్టచూడుము. కన్నులవెంట నిప్పులు గ్రక్కులాగునఁ దోఁచుచున్నది.

హుసేను.—నేఁడేమి యిట్లు వెఱ్ఱివగుచున్నావు! నా కిప్పుడు జాతివలెఁదోఁచు నీబొమ్మ నీకుమాత్ర మట్లుగోచరించునా! నీభయమే యందులకుఁ గారణము.

అబ్దుల్.—అతని నిప్పుడిప్పుడును ఈ దేవి యావేశించుటకలదు. కాఁబట్టి యాశక్తి యాతనియెడఁ దన రూపమును బైలు వెట్టుచుండునని విశ్వసింపవలయును.

హుసేను.—దేవతలు, ఆవేశములు, అని తెలివిలేనివారి నివంచించుటకై మాయావు లొనర్చెడి నటనములు కాని యన్యములుకావు. జీవనో పాధింగానకి మీతో నిప్పుడు చేరినను నేను మొట్టమొదట నాగరకాగ్రగణ్యుఁడను. అట్టి నాయెడల మీమాట లుపయోగింపఁజాలవు.

వెంక.—ఓయా! మాకు దేవియందు భక్తి విశ్వాసములు నుండు. అబిషకును మాపైఁ బ్రీతి విశేషము గాఁగలదు. మేమిందఱము నమ్మియుండునపుడు నికిష్టము లేకున్నను మాతో నేకీభవించియే తీరవలయును. కలహములుమాని ఈ మహాశక్తిని బూజింతము.

అంత వారెల్లరు నచ్చటనుండి వెలుపలికరిగి పూజార్థమొక సుగాభాండమును, మేక నొక్కదాని నటకుఁదెచ్చిరి. కొబ్బరికాయ, తాంబూలము, కర్పూరము, మున్నగువానిని గొనివచ్చిరి. వీనింగాంచినంతనే సత్యవతికి మిక్కిలి యేవగింత కలిగెను. ఆయుపకరణములన్నిఁ ధ్వంసముగావింప వలయునను సంతోప ముదయించెను గాని, ఏకాకినియగు నాబిడ యేమి చేయఁగల్గును! దానఁ దాల్మియే మేలని యూరకుండెను. వారును బూజోపకరణముల నేల నునిచిరి.

హుసేను.—వెంకయ్యా! నాకు మహా మయావిగారి దర్శన మెప్పుడు గలుగఁ గలదు?

వెంక.—పలువిధములఁ బరీక్షితులైన యావలఁగాని మా యజమానుని దర్శనము లభింపదు. ఇట్లే మనవారొక్కొక్కరు నెంతయో కాలము ప్రతీక్షించు చుండిరి.

హుసేను.—అది యట్లుండనిండు. నేనిన్ని దినములుగాఁ బ్రార్థించు చుండినను నన్నేల మీ ముద్రణాలయములోనికిఁ గొని పోవకున్నారు? మొన్న ద్వారముదాఁక వచ్చిన నాని నన్నచ్చటనే యునిచికదా మీరు లోని కరిగితిరి!

వెంక.—మేము ముద్వారము దప్ప నింకేరునందుఁ బ్రవేశింపఁ జనదు. అచ్చట నొక్కొక్క కూలివానిచేతను దుపాకియున్నది. యజమాను నుత్తరువు లేక చొచ్చినవా రెట్టివారైనను వారాలోచింపక కాల్చివేయ వలయునని మహామాయావిగారి శాసనము. కాఁబట్టియే నిన్ను బిలిచికొని పోవకుంటిని.

హుసేను.—ఇంక నే నాయాలయమును జూచుటకు వీలు లేదుకదా!

వెంక.—రేపు శుక్రవారము. ముద్రణాలయమున నాదినము పనియేదియును జరుగదు. సెలవుదినములలో వాకిలి మూసియుంచుదురు. కాఁబట్టి దిడ్డిత్రోవను బో వీలగును. ఇచ్చటికి నుత్తరమునందు జంటముద్దలు నీకుఁ దెలియును గదా! దాని యడుగునఁ గొన్ని మూండ్ల కంపలు పఱిచియున్నవి. వాని నెత్తినచో నొక ద్వారము దృష్టిగోచరము కాఁగలదు. దాని తలుపులఁ దెఱచినచోఁ గ్రిందికి దిగుట కనువగులాగున మెట్లమరియుండుట గాంచవచ్చును. ఎంచుచు నేఁబది

మెట్లు దిగవలయును. దాని క్రింది కదుగిడఁ జనదు. అదియొక కూపపుదలుపు. దానిపై నడుగువెట్టినచో నాబావిని బడి మృతి నందవలసి యుండును. ఏఁబదవ మెట్టున దిగినంతనే ఉత్తరపు వైపునఁ జేతితోముట్టి చూచిన చో నొక గోళాకృతి యున్నట్లు తెలియఁగలదు. దాని నదిమినచో నది యిరుపాయలగును. అదియొక భూగృహముయొక్క ద్వారము. అందుఁ బ్రవేశించినచో సమతలము గన్పట్టును. అచ్చటి కించుక దక్షిణమున వేణువనమునుండి వచ్చుబాట గన్పట్టును. అచ్చటనే మన దోపిడిగాండ్ర గుడిసె లుండుట నీ వెఱిఁగిన యంశమేకదా !

హుస్సేను.—వేణువనమునుండి నేనాదారిని మావారి గుడిసెలయొద్ద కెన్నియోతూఱు లరిగి యుంటిని గాని ఈ గుప్తమార్గము నెన్నఁడును జూడలేదు.

వెంక.— మీగుడిసెల వంకకుఁ బోవక అచ్చటి నుండి యుత్తరపువైపునఁ గొంతదూర మరిగిన ముద్రణాలయపుదిడ్డి కన్పట్టును. దానిచెంత నొకరక్షకభటుఁడుండును. శుక్రవారమునాఁడు మాత్రమే యాతలుపులు దెఱచియుంతురు. అచ్చటికేఁగునపు డాఁడువేస మూనవలయును. వానియొక్క 'జయమహాకాళి' యని యాడినచో వాఁడు లోనికి విడువఁగలఁడు. స్త్రీవేషము ధరింపకున్నను 'జయమహాకాళి' యని యాడకున్నను ద్వారపాలుఁడు తత్క్షణమే శిరచ్ఛేదము గావించును. ఇది మాయజమానుని యాజ్ఞ. సెలవు దినమగుటచే లోన నెవ్వరునుండరు. ఆప్రదేశము కలయంజూడవచ్చును గాని యంత్రములు సేయుపనులంజూడ వీలుకాదు. అటనుండి కదిలి మరల నాద్వారమునొద్దకు వచ్చి, 'జయపరమేశ్వరి'

యనిన వాఁడు వెలికిరానిచ్చును. అట్లననివాని వెంటనే చెఱ నిడవలయునని యజమాను నానతి. మరలి వచ్చునప్పుడు ఆ గోళాకృతికి లోవైపుననుండు నొక చీల నదిమినఁ దలుపులు తెఱచికొనఁ గలవు. అటనుండి యథాప్రకారము మెట్లపై నెక్కి, వెలుపలికి రాఁగనే యాద్వారముమూసి ముండ్లకంప పైన వైచి మాతోడఁ గలసికొనుము.

హుసేను. — ముద్రణాలయమునకు రక్షకభటులచే నేయుపాయమును రాకుండుట కనువగునంత భటసహాయము మనకింకను గుదురలేదని యెంచెదను.

వెంక. — ఇప్పుడు నేఁజెప్పిన గుప్తమార్గ మెవరికిని దెలియదు. ఒక్కచోఁ దెలిసినను నేఁబదియొకటవమెట్టు వారి నాహారము గావించికొనును. ఇంక వేణువనమార్గ మెట్టివారికిని నగమ్యము. కష్టపడివచ్చినను మీవారిగుంపున నఱువది మంది కలరు గదా! ముద్రణాలయమునందలి కూలివాండ్రేనుబదిమంది యున్నవారు. ఇట్లు మనవశమున నూటనలుబది భటులుండ మనమేల రక్షకభటులకు భీతి నందవలయును? కూలివాండ్రును మీవారు గుడిసెలకుఁ దూర్పున నించుకదూరమునందు గుడిసెలలోన యున్నవారు — సరి. అది యట్లుండనిమ్ము. సెట్టిగారూ! మీ రెప్పటిచొప్పునఁ గాళీమహాశక్తికిఁ బూజ గావింపుఁడు.

మల్లయ్యసెట్టియుఁ బూజ కుపక్రమించెను. శక్తి యెదుట నొక ప్రమిదలో నేతిని బోసి దీపము వెలిగించెను. అది గాలితాఁకుడు నాఱిపోయెను. అంత వారదియొక యపశకునముగా భావించిరి. కాళికకింకను దమపై నాగ్రహమున్నదని తలఁచిరి. వీరి యీమూఢత్వమునకు హుసేనునకు నవ్వువచ్చు

చూడెను గాని వారదిచూచిన నాగ్రహింతురని యెంచి కొనెను. మల్లయ్య మొదలగువారు నాశక్తి ననేకవిధము లుగాఁ బ్రార్థించుచుండిరి. అప్పుడు వెంకఁడు నాదేవీ విగ్ర హముగాంచి;

వెంక.—అమ్మా! మాపై నీదినమింత యాగ్రహము పూననేల? నీపూజలలో మేమెప్పుడును ఎట్టిలోపములును జేసి యెఱుఁగము గదా!

మల్ల.—నేఁడు నాకావేశము వచ్చులాగునఁ దోఁచు టలేదు. కాఁబట్టి యాబిడ ఏలాగున మన కొఱఁత దీర్చె డినోయని యెంచు చున్నాఁడను.

అబ్దుల్.—దేవి పెదవిని గదలించులాగున నాకంటికిఁ బొడఁగట్టినది. కారణమేమియో నేనెఱుఁగఁ జాలను.

మల్ల.—నాకు నట్లే పొడగట్టు చున్నది.

వెంక.—దేవిగారికి మాటలాడునంతటి శక్తిలేదా! మనము నాబిడమాట లాలకింపఁ జాలునంతటి భక్తులము కామా! అమ్మా! మేము నీకు నిక్కపుభక్తులమేని మా లోపముల వెంటనే మాకుఁ దెలుపవలయును. లేనిచో మే మిచ్చటనే ప్రాయోపవేశము సేసి ప్రాణములు వాసెదము.

ఇది వినిన హుసేను. "ఈమూఢు లిట్లాడుచున్నారు. ఱాతిబొమ్మ పలుక నేర్చునా? కాఁబట్టి వీరిచ్చటఁ బ్రాణములు వీడుట నిశ్చయము. వీరితోడ నేనును జావవలసినదియే కదా! ఇట్లకాలమృతి నందుటకా వీరితోఁ గలిసితిని!"
అని చింతించు చుండెను. సత్యవతియు నిదియే తగునదని యెంచి గంభీరస్వరము తో;

సత్య.—భక్తులారా! నాకీదినమున నాగ్రహముగల్గు

టనిజమే. ఈహుసేనందులకుఁ గారణము. ఇతనికి నాయం దింకను నమ్మకము గుదురలేదు. ఇట్టి విశ్వాసహీనుని మీరు చెంతఁ జేర్చికొనుటయే నాకోపమునకు మూలకారణము. ఇప్పుడైన నీతఁడు నాపాద భక్తుఁడైనచో క్షమింతును. లేకున్న మిమ్మెల్లర నాశముగావింతును. ఇందులకు బదులేమాడెదరు?

వెంక.—ఓయీ! నీనాదేవిగారి యెదుట సాగిలఁబడి మ్రొక్కి నీతప్పును క్షమింపమని వేఁడికొనుము. ఆమెకు నీమూలముననే మాపై నాగ్రహము గలెను. నీవట్లాచరింపకున్నచో నాయీఖడ్గమున నీతలద్రుంతును.

హుసేనును జేయునది లేక సాగిలఁబడి మ్రొక్కి తన తప్పుల మన్నింప వేఁడికొనెను.

సత్యా.—సాహెబ! నినుక్షమించితిని. భక్తులార! రేపు రేయినుండి యొకవారము దినములు మీరీ యాలయమును వీడి చనరాదు. దాన మీకు రానున్న యొక యాపద వాయఁ గలదు. మీ యెడ ననుగ్రహముననే నేనీయుపాయము సెప్పియున్నదానను. ఇందించుకయైన బొరవడితిరా, మీప్రాణములు మీవిగావు. జాగ్రత్త. మీరు రేపురేయి నిచ్చటికి వచ్చునంతదాఁక మీపూజాదుల గ్రహింప నొల్లను. ఇప్పటికి వెడలిపొండు.

ఈమాట లాలించిన వెంకఁడునున్నగువా రావిగ్రహము నెదుట సాగిలఁబడి మ్రొక్కి లేచిరి. హుసేనునకు మాత్ర

మూవిగ్రహమట్లు మాటలాడుట యాశ్చర్యముగఁ దోఁచెను. తొలుదొల్త విగ్రహము వెనువైపున నెవ్వరేనుండురేమో యని తలఁచెనుగాని యట్టిఘోరారణ్యమున నెవ్వరు నంతసాహసించి యుండఁబోరని యెంచెను. క్రమక్రమముగ నాతెనికి నాశక్తియొక్క శక్తి యపారమగు నదిగా నుండుననియే తోఁచెను. వారట్లు దేవికి నమస్కరించి పొదరుటిల్లు వెడలి వెలుపల వచ్చిరి.

సత్యవతియు వారట్లేఁగఁగనే, తాను నటనుండికదలి వారు వచించిన విశేషముల నెల్లంగాంచ నెంచెను గాని, ఆ దినము తానేఁగుట క్షేమావహము కాదని యెంచి యూరిలోని కరిగెను.



పదునాల్గవ ప్రకరణము.

## దొంగలు పట్టువడుట.



మోతీ.—అమ్మా! ఎంతటి ధైర్యము! ఒంటరిగా నట్టిడవి నట్టియెడ నిర్భీకలగు మీరు సబలలుగాక యబల లెట్లగుదురు? మీసాహసమెంతయు మెచ్చఁదగినది. మూఁడు దినములనుండియు మీయజమానుఁడు వెదకుచుండియుఁ బట్టువడని యాక్రూరచోరుల మీమాట జవదాఁటకుండఁ

జేసికొనిన వారలు మీరే యాకాళికాశక్తి యగుదురు కాని శక్తిహీనమగు నాశిలావిగ్రహము శక్తికాదనియే నా విశ్వాసము.

సత్య.—అయిన మావారికి నేను సాయపడుదానను.

మోతీ.—ఎవ్వరే నపరాధ పరిశోధకులైన సరి యగునే కాని యాఁడువారు మీరాయనకు సాయపడ నెంచుట సమంజసముకాదు.

సత్య.—(నవ్వుచు) అట్లే నపరాధపరిశోధకుని రప్పించెదను.

అని లోనికరిగి మున్నొకనాఁడు భర్తనుజూడ నరిగి నప్పుడు తానుధరించినలాగున దుస్తులుదాల్చి మోతీబీబీ చెంతకువచ్చి ;

సత్య.—ఇదె చిత్రాశ్వుఁడను నపరాధపరిశోధకుఁడనైతిని.

మోతీ.—అమ్మా! కాదుకాదు. అయ్యా! మీవేషమునకుఁ దగినట్లు కదా మిము బిలువవలయును. కార్యము జయప్రదమగులాగున గావించికొని రండు. మీస్త్రీత్వమును బైలువెట్టఁ బోయెదరు సుమా!

ఆవల సత్యవతియు నాబిడను వీడ్కొని వేంకటేశ్వరుఁడు దిగియుండు బసకరిగెను. వాకిటనిలిచి చిత్రాశ్వుఁడని యొకచిన్నకాగితముపై వ్రాసి లోనికంపెను. వేంకటేశ్వరుఁడు ఆచీటిని జూచినంతనే తానే వెలుపలికివచ్చి యామెను

లోనికిఁ బిలిచికొనిపోయి యొకయాసనముపైఁ గూర్చుండఁ బెట్టెను. తాను నొకయాసనమున నమరెను. అంత వారిటు సంభాషింపఁ దొడఁగిరి.

వేంకటేశ్వర. — చిరాశ్వుఁడు గారూ! తమదర్శన మగుటకు చాలరోజులాయెను! తమ కార్యములెల్ల జక్కఁ బడి యుండునని తలఁచెదను.

సత్య.—చాలవఱకుఁ జక్కఁబడెను. నే నీనడుమనఁ దమదర్శనము కొఱకు వైద్యశాలకు వచ్చియుంటిని. తా మెవ్వరితోడను మాటలాడునంతటి స్థితిలో లేరని విని వెనుకకు మరలితిని. ఈ దినమునఁ దామిచ్చటవచ్చియుండుట దెలిసెను. వెంటనే తమ దర్శనమున కరుదెంచితిని.

వేంకటేశ్వర.—అయ్యా! నాఁడే తమ సాయమును గోరియుంటిని. అన్యకార్య వ్యగ్రులగుటచే నప్పుడు కాదంటిరి. ఇప్పుడైనను నాకు మీసాయము కలుగఁగలదా!

సత్య. — అధికారులు మీ రానతిచ్చినపిమ్మట నే నుదాసీనుఁడుగా నుండఁగలనా? అద్దాని నప్పుడే పూర్తిసేసితిని.

వేంకటేశ్వర.— చోరులజాడ గనిపెట్టియాయెనా?

సత్య.—చోరులలోఁ బ్రధానుల నల్వురం గనిపెట్టితిని. వారి ముద్రణాలయముండు తావును గనిపెట్టితిని. తా మిప్పుడు నల్వుర భటుల సంకెళులతోడ నాయత్తపడుచుండ వలయు. ముందా నలువురంబట్టి శాంతయ్య కప్పగింపవల యును. అతఁడు వారిం దోడ్కొని యూరిలోని కరుగనిండు.

రెండువందల భటులు నేఁడెల్లెడి చోట నివసించియుండినచో వారితోడ మన మా ముద్రాణాలయమును బ్రాపించి, అచటఁగల నూటయేఁబదిమందిని బట్టికొందము. ఈ దినము శుక్రవారమగుటచే, ముద్రాణాలయము మూయఁబడి యుండును. అందలి కూలీలు మున్నగువారును విరామ దినమగుటచే సుఖనిద్రనుందురు. వారింబట్టుట యతిసులభము.

వేంకటేశ్వర.—అట్లే యొనర్చెదను.

వేంకటేశ్వరుఁడును సత్యవతి యాడిన చొప్పున భటుల నాయత్తపఱచె శాంతయ్యయుఁ వారును దనతో రాఁగ, సత్యవతి చూపుమార్గమున నరిగెను. సత్యవతియు జంటమద్దులగొయ్యె నొకపొదను రెండునందల భటులగుప్తముగా నుండ నియమించెను. వేంకటేశ్వరుఁడును శాంతయ్యయు, నల్వురు రక్షకభటులును దనవెంటరా నావిడ కాళియుండు నా పొదరుటింటిని సమీపించెను. అప్పటికే యా దుష్టులు నల్వురునటకు వచ్చి కాళిక యనుగ్రహమున్నది గదాయను మూఢవిశ్వాసమున భయముదక్కి గాఢనిద్రితులై యుండిరి. సురాపానముచేఁ గల్గిన మత్తత యానిద్ర కెంతయుఁ దోడ్పడుచుండెను. సత్యవతి యాజ్ఞచొప్పున వేంకటేశ్వరాదు లడుగు చప్పుడు గాకుండ మెల్లమెల్లగ నడచుచు నాప్రదేశము చొచ్చిరి. వేంకటేశ్వరునా నతి చొప్పున భటులానల్వురి పాదములకును సంకెళులునైచిరి. అంత వారి కామత్తు తగ్గినది. ఎదుట వేంకటేశ్వరుఁడు మున్నగువారినిజూచి చప్పునలేచి పర్వులిడ నెంచిరికాని పాద

ములకు సంకెళులు దవిలించియుంట నది యసాధ్యమాయెను. దొంగ వెంకఁడు వారింజూచి;

వెంక:—అయ్యా! శూరవరులగు మీరేల ఇట్లు నిద్రితులగుమమ్ముబట్టి బంధించితిరి?

వేంకటేశ్వర:—రాజమహేంద్రవరము నందలి మండల న్యాయాధిపయొక్క కచేరీలో మిమ్మతిథులు గావింప నెంచియే పట్టితిని.

వెంక.—మేమేమి తప్పొనర్చితిమని మము బట్టితిరి?

వేంకటేశ.—ఆవివరమెల్ల విచారణ సమయమునం గదా తెలియఁగలదు!

వెంక.—మాసల్వురంబట్టి నంతన కార్యము లెల్లం గొనసాగెనని యూయెంచితిరి?

సత్య.—మీగూడమునఁగల నూట యేఁబదుగురును బట్టుబడిరి. మీ ముద్రణాలయము నందలి యంత్రాదు లన్నియు మాయధీనమాయెను.

ఈ మాట లాలకించినంతన వెంకఁడు మున్నగువారు రిచ్చవడి యట్టె నిలిచిరి. వెంకఁడు మాత్ర మించుక ధైర్యము దెచ్చికొని;

వెంక.—మే మెల్లరమును బట్టుబడినను మాయజమానుఁడు మాత్రము మీచేతికిఁ జిక్కఁజాలఁడు.

వేంకటేశ్వర.—శాంతయ్యా! మీరీ నల్వురఁ నిలిచి

కొని యీభటుల వెంటనూరిలోని కరుగుఁడు. నేనును జిత్రాశ్వుఁడునిదె వచ్చెదము.

శాంతయ్యయు వారిం బిలిచికొని వెళ్లెను. వేంకటేశ్వరుఁడును సత్యవతి చూపినదారి నరిగి, జంటమద్దులయొద్దఁ జేరిరి. సత్యవతియు నొక యీలవైచెను. వెంటనే యచ్చటి పొదం దాగియుండినరక్షకభటులును సమీపించిరి. ఆబిడయును ఏఁబదవ మెట్టున కావల నడుగిడకుండులాగున వారి కానతియిచ్చెను. అంత నాదారిని వారు భూగృహమునకరిగిరి. అందుఁ జొచ్చినంతనే యాయాప్రదేశముల కరిగి గుడిసెలలోనుండు దొంగలగుంపును బంధించిరి. ఇట్లచ్చటివారి నెల్ల బంధించి వారికి భటులఁ గాపుంచి ముద్రణాలయము దిడ్డియొద్దకు సత్యవతీ వేంకటేశ్వరులు నల్వురు భటులతోడ నరిగిరి. అచ్చటి కావలివాఁడు తొలుదొల్త వారితోఁ గలియఁబడ నెంచెను గాని ఒక్కరుఁడందఱితోఁ బోరుట సరికాదని యెంచి యూరకుండెను. భటులు వానిం గూడఁబట్టి బంధించిరి. వానియొద్దఁగల తాళపు చెవులగుత్తిని బలాత్కారముగా నూడఁ బెఱికికొనిరి. తలుపులు తెఱచికొని లోనికిం బ్రవేశించిరి. అందుండు కొన్ని ముద్రాసాధనములం జూచుచుండ నొక పేటిక వేంకటేశ్వరునికి నయనగోచరమయ్యెను. అది తనయింట నుండునట్టిదని గుర్తించి, దానిం బవలఁగొట్టినంతనే తనయింటనుండిన కానులపేరును మఱికొన్ని యాభరణములు నుండెను. వేంకటేశ్వరుఁడు నదిగాంచి రామచంద్రశాస్త్రికిఁ దప్పక యిందు సంబంధముగలదని నిశ్చయిం

చెను. రామచంద్రశాస్త్రిని బట్టిబంధించిన నంతయు బయలువడు నని యెంచెను. అతఁడు కొన్ని దినములుగాఁ గాన్పింప కున్నందున నేమిసేయుటయని యాలోచించెను. తుదకు వెంకడు మున్నగువారి మూలమున, ఆతనియునికు మనుకు లేవేని దెలియఁ గలదేమో విచారింతమని యెంచెను. సత్యవతియు నాసొమ్ములఁగాంచి నప్పటినుండియు రామచంద్రశాస్త్రిపై నను మాన ముగల్గి యుండెను.

అంత వారా ముద్రణాలయ మెల్లకడలను జక్కఁగాఁ బరీక్షించి, విలువగలవాని నాదొంగలమూఁకచే మోయించి కొని కాకినాడకు వచ్చిరి.



పదునేనవ ప్రకరణము.

# సత్యము బయలువడుట



రాజమహేంద్ర వరమున మండల న్యాయాధికారి యాస్థానమున నొకనాటి మధ్యాహ్నమున జనులు క్రిక్కిరిసి యుండిరి. దొంగ వెంకఁడు మున్నగు వారి యపరాధములు స్థిర పడినందున వారికీదినమున దండన జరుగఁ బోవునని యెల్లరు నాడికొను చుండిరి. అప్పట్టునఁ గ్రైస్తవాంగన యొక్కతె యచ్చటికివచ్చెను. ఆమె వేంకటేశ్వరుఁడుండు ప్రదేశ

మునకు వచ్చెను. అతఁడప్పు డేకాంతముననుండి విచారణ యగుచుండు నా విషయమై యేమియో యాలోచించు చుండెను. ఈబిడఁగాంచిన వెంటనే యాశ్చర్యమునొంది;

వేంకటేశ్వర.—నీవేల యిట కరుదెంచితివి?

క్రైస్తవాంగన.—మీతో నించుక మాటలాడవలసి యుండుటచే వచ్చినదానను.

వేంకటేశ్వర.—ఎప్పట్టున నైనను నాతో మాటలాడు టకు నీ కేయభ్యంతరమును లేదు.

క్రైస్తవాంగన.—ఇప్పుడు విచారించఁబడు చుండు వారినిఁగుమనసనుంపు హుసేననువాఁడు నిక్కముగ దొంగ కాఁడు. అతఁడు గొప్ప కుటుంబమునకు సంబంధించిన వాఁడు. వేఱు జీవనోపాయ మెఱుఁగక వీరితోఁ డఁగలిసెను. కావున వాఁడింక మంచి నడవడిగల్గియుండు లాగున నంగీకరించినచో వానిని మాత్రము శిక్షింపక వదలు నుపాయము గావింప వలయును. ఇదియే నా ప్రథమప్రార్థన. ఇదియే నా యంత్యప్రార్థనము నగును.

వేంకటేశ్వరుఁడు.—వాఁడు పూర్వము దొంగకాఁడ నియు బ్రదుకు తెరువు తెలియక వీరితోఁ గలిసెననియు నిది వఱకే గ్రహించి ఈ యభియోగమున నాతని సాక్షిగాఁ గైకొనియున్నారము. కావున నీవు తలఁచిన లాగుననే జరుగ గలదు.

వీరిటు మాటలాడిన వెంటనే వేంకటేశ్వరుఁడున్యాయాధి

పతి చెంతకు వెళ్ళెను. శాంతయ్యా మున్నగువారు వచ్చి యుండిరి కాని, చిత్రాశ్వుఁడు మాత్రము నాఁడేలో రాకయుండెను. న్యాయాధిపతియు దొంగ వెంకనికి యావజ్జీవద్వీపాంతరవాస శిక్షవిధించెను. అబ్దుల్ కరీమునకును మల్లయ్యకు నేడు సంవత్సరములు గఠినశిక్ష విధించెను. తక్కిన పరిజనుల కెల్లను రెండేసి సంవత్సరములు శిక్షవిధించెను. హుసేనునకు శిక్ష విధింపక రెండు సంవత్సరములవఱకు నీతఁడు స్వేచ్ఛగానున్నను రక్షక భటాధికారమునకు లోఁబడియే యుండవలయుననియు, రక్షక భటాధికారులు నీతని ప్రవర్తనను గుఱించి పరీక్షించు చుండవలయుననియు, అట్లు వచ్చిద్వాయమును సత్ప్రవర్తన గలవాఁడయ్యెనే నాతల వాని కానిర్బంధ ముండదనియు నుడివెను. శిక్షితులు రక్షక భటులతోఁ గారాగారమున కరిగిరి. తక్కిన వారును వారివారి యిండ్ల కరిగిరి. వేంకటేశ్వరుఁడు క్రైస్తవాంగనను దనతోడన గుఱ్ఱపు బండి నెక్కించికొని యెను. ఆబిడ చెప్పుటచే హుసేనునిగూడ దనతోడన ఎక్కించికొనెను. చిత్రాశ్వుఁడు నాఁటిదిన ముదయముదుండి గాన్పింపమి కాతఁడింతయువిస్మయమందు చుండెను. మనసునఁ బరి పరి విధముల నాలోచించుచుండెను. ఎంత విచారించినను సందులకుఁ గారణ మాతని మదికిఁబొడఁ గట్టకుండెను. తుదకాతఁడే దేనని వార్యమగు కార్యభారముపైఁ బడియుండుటచే నాలాగునఁ, దనతో చెప్పకయ యేఁగియుండు నని తలఁచెను. వీరటుపోవుచుండ హుసేను దటాలున నాతని

పాదములు పట్టి నమస్కరించి, తనయపరాధములను మన్నింపవలయునని వేఁడెను. వేంకటేశ్వరుఁడును అతఁడట్లాడుటకుఁ గతము తెలియక వింతపడి;

వేంకటేశ్వర.—నీ వాచరించిన యపరాధ మెట్టిది?

నేను.—నేను గడు బీదవాఁడను. నాసోదరియింటనుండి, విధవయగుటచే నా బిడకుటుంబ వ్యవహారముల నేను చూచుకొనుచుంటిని. నాకు ద్రవ్యము కావలసినపుడెల్ల రామచంద్రశాస్త్రి మూలమున మా యింటనుండు నగలమ్మించికొనుటఁగలదు. అవినా సోదరివగుటచే నేనాచరించున దకార్యమని తెలిసియు, బీదతనమున నట్టి యకార్యముఁ సేయఁ బొలువడితిని. తన్మూలమున వారికి నాకు నించుకపరిచయముండెడిది. ఒక్కనాఁ డాతఁడు నాయొద్దకు వచ్చెను. అప్పుడు మాయిర్వురకీలాగున సంభాషణము జరిగెను.

రామ.—రాజమహేంద్రవరమున నొక వనితగలదు. ఆబిడ మిక్కిలి రూపవతి. ఆమె యత్తగారాబిడను విక్రయింపనున్నది. నీవు నవవివాహితుఁడవగుటచే ఆవనితను గొని వివాహమొనర్చుకొన నచ్చు" ననెను,

నేను.—ఆబిడ యెవ్వతె?

రామ.—ఆబిడ యీమండలపు రక్షకభటాధ్యక్షుని భార్య. సత్యవతియని యామె పేరు.

నేను.—అయ్యో! నే మునిఁగిపోవలయునని యామీ యభిప్రాయము!

రామ.— నీవు భయపడ నవసరములేదు. ఆబిడ యావలకే దుశ్చారిణి. భర్తకు నది తెలియును. కాఁబట్టి యతఁడా విషయమున జోక్యము గల్గించికొనఁ జాలఁడు.

నేను.— ఈవిషయము నాసోదరికిఁ దెలిసినచో నా బిడ నన్నీయింటినుండి తఱిమి వేయునుగదా!

రామ.— ఆవనిత మిక్కిలి ద్రవ్యలోభముగలది. ఇంటికి వచ్చినంతనే కొంతద్రవ్యము నిచ్చినచో నిను వివాహ మాడ నంగీకరించును. వధూవరు లిష్టపడిన, సోదరియేమియు నాక్షేపింపఁబోదు.

నేను.— అట్లైన నాబిడ మాయిలు చేరుట కుపాయమేమి?

రామ.— మేము నాటకసందర్శనమునకై వత్తుము. నీవు నప్పుడటకువచ్చి యొకబండిని, గుదిర్చికొనినచో నందాబిడ నిడికొని యరుగవచ్చును.

నేను.— అపరిచితుఁడగు నాతోడఁ దబాలున బండి యెక్కుట కాబిడ యంగీకరించునా?

రామ.— నే నామెకొక యౌషధమిచ్చెదను. తన్మూలమున నాబిడకు శరీరము తెలియకుండును. అప్పుడామెను నీ బండిపై వైచికొని యేఁగుము. ఆబిడకుఁదిరిగి తెలుఁకువగల్గు లోపల నీయింటఁ జేర్చికొనవచ్చును.

నేను.— భర్తగారి కెఱుకగాకుండ నాబిడ నాటకశాలకెట్లు రాఁగలదు?

రామ.— ఇప్పుడతఁ డూరలేఁడు.

ఇట్లు సంభాషణము జరిగెను. దుష్కాల ప్రేరితుఁడనై నేను నద్దాని కంగీకరించితిని. విక్రయధన మైదువందల రూప్యములని యాడి యాతఁడు నాయొద్ద గ్రహించెను. నేను శాస్త్రి యొక్క మాటచొప్పున బండిని మాటలాడుకొని నాటకశాలయొద్దకు వచ్చితిని. ఆతఁడును మీతల్లిగారును, మీసోదరియు నౌషధసేవచే మైమఱచియుండు సత్యవతిని నాకప్పగించిరి. వెంటనే నేనాబిడను బండినినెక్కించుకొని కాకినాడకుఁ దెచ్చికొంటిని. ఇంటికిఁ జేరిన పిమ్మట నాబిడకు మెలఁకువగల్గెను. నేనును సత్యవతికి నాయభిప్రాయ మెఱిఁగించితిని. ఆమె యందుల కంగీకరింపదయ్యెను. నేనును నిర్బంధింపఁ బూనితిని. ఇంతలోన నాసోదరి యటకువచ్చుటచే సత్యవతి కెట్టియిక్కట్టును గల్గదయ్యెను. ఈయకార్యాచరణమునకు ఫలముగ నాసోదరి నన్నిలువెడలఁ దఱిమెను. ఆపలయుదంతమంతయు నీవఱకే వెంకఁడు మీకెఱుకపఱచెను గదా!

వేంకటేశ్వరుఁడు నీమాట విని తినతల్లిపైనను సోదరిపైనను నత్యంతము కుపితుఁడై;

వేంకటేశ్వర.—ఇదె నేనింటికిఁ జనినవెంటనే నాభార్య విషయమున ద్రోహముగావించిన నాతల్లిని, సోదరిని యింటి నుండి లెఱిమివేసెదను.

శాస్త్రి సవనిత.— మీరట్లాగ్రహించుట సరికాదు. తల్లిని దైవముతో సమానముగ భావింపవలయును గదా!

వేంకటేశ్వర. — అపరాధులను బంధువులని యెంచి వారితప్పును సహించుట నామతముకాదు.

క్రైస్తవవనిత.—మీమత మిదికాదని యీండలేదు, శాస్త్రముమాట యటుండనిండు. తల్లిని సోదరినట్లు సేయుట మీకవమానకరమగును గావున నీప్రయత్నముమానుఁడు

వేంకటేశ్వర.—తప్పుచేసిన వారెట్టివారైనను నేను మన్నింపను.

క్రైస్తవవనిత.—అట్లు నీసాహెబు నపరాధిగాఁడా!

వేంకటేశ్వర.—పశ్చాత్తాపుఁడగుటచే నీతఁడు క్షమింపుట కర్హుఁడు.

క్రైస్తవవనిత.— వారు నట్లు పశ్చాత్తప్తులైనచో నేమి చేసెదరు?

వేంకటేశ్వర. — అప్పటిమాట చూచికొందము. ఇప్పటున వారినించుకయు మన్నింపను. ఇదియే నాదృఢప్రతిజ్ఞ.

వీరిటు మాటలాడుచుండ నింతలో వేంకటేశ్వరునింటి యొద్ద బండినూఁగెను. క్రైస్తవవనిత బండిదిగుచు నురల వేంకటేశ్వరరునితోఁ, "గొంత యోర్పుగల్గి యుండుఁడు. తొందరపడకుఁడు." అనిచెప్పి తనదారినరిగెను. సాహెబును దన వెంటనిడికొని వేంకటేశ్వరుఁడును గృహముచొచ్చెను.



పదునాఱవ ప్రకరణము.

# మహామాయావి



సత్యవతి యిప్పుడు రాజమహేంద్రవరమునఁ దంఁడ్రి గారియింట నున్నది. ఈబిడ యొకటిరెండు తూఱులు మాఱు వేసమూని నప్పటినుండియు ఏ సమయమున, ఎట్టివేషములు ధరింపవలసి వచ్చినను సమర్థురాలయ్యెను. అందులకుఁదగు సాధన విశేషములన్నియును ఈబిడయొద్ద నుండినది. ఆమె యొకనాఁటి సాయం సమయమున మేడపైఁ గూరుచుండి వీథివైపునఁ జూచుచుండెను.

అప్పుడొక మహమ్మదీయవృద్ధుఁడు, ఆవైపునఁ బోవుచుండెను. ఆతని యంగము లత్యంతము శుష్కించియుండెను. చేతనొక కఱ్ఱనుబూని శరీరమెల్ల వణఁకుచుండ వంగివంగి నడచుచుండెను. వానికించుక ముందు భూషణాలంకృతుఁడగు బాలుఁడొకఁడు పోవుచుండెను. ఈముదుసలియు ఆబాలకుని ననుసరించు, చున్నలాగున నాబిడ యనుమానించెను. వెంటనే తనగదిలోనికేఁగి యాబిడ యొక మహమ్మదీయ యువకుని వేషముపూని వెలికివచ్చెను. ఇంచుకదూరమున ఆముదుసలిని వెన్నంటిగసే పోవుచుండెను. వృద్ధుఁడు నా బాలునిచెంతఁజేరి బుజ్జగించుచు నొక మిఠాయిపొట్లము అతని చేతఁ బెట్టెను. బాలకుఁడు నది కారణముగ వాని తోడన

వచ్చుచుండెను. ఇదిగాంచిన సత్యవతియుఁ; దప్పక యీతఁడు చోరుఁడేయగునని తలఁచి ఇంచుకైన నేమఱక యతి జాగరూగరూకతతో వారి వెంటఁ బోవుచుండెను. వాఁడు వేగముగ నడచినఁ దానును వేగముగ నడచుచుండె. వాఁడు తిన్నఁగా నడచినఁదానును దిన్నగా నడచుచుండెను. వాఁడునిలిచినఁ దానును నిలువఁబడి యుండెను.

వీరిటు పోవుచుండ నాముదుసలి యా బాలునితో జన శూన్యముగ నుండిన యొక యింటివాకిటి యరుగునొద్ద కరిగెను. సత్యవతియు వారు దనకుఁ గాన్పించునట్లు దానికెదుటి శ్రేణిలోనుండు నొకయింటి వాకిట నిలిచి చూచుచుండెను. ముదుసలియు మెల్లగ నాబాలుని లాలించుచు; అతని మెడనుండు చంద్రహార మొక్కండ దపహరించి, తాను దొడిగికొని యుండిన కవచమునందు దాఁచికొనెను. వెంటనే ఆబాలుని వీడి వచ్చిన దారి నరుగుచుండెను సత్యవతియు వానిననుసరించి వెళ్లుచుండెను.

వేంకటేశ్వరుఁడును మఱికొందఱు రక్షక భటులును వీరికెదుట వచ్చుచుండిరి. ముందుఁబోవుచుండు ముదుసలి వేంకటేశ్వరుని దేఱిచూచి మరల తన దారినే వెడలెను. సత్యవతియు నాతనిగాంచి, రహస్యముగా నిట్లనియెను.

సత్య.—అయ్యా! ముందుఁ బోవుచుండు ముదుసలిని బట్టికొనుఁడు. వాఁడొక దొంగయగుటనేఁ గుర్తించియున్నాఁడను. నాకుఁజూడ వాఁడు తెమ్ము గుర్తుపట్టి యున్నాఁడనియే తోఁచుచున్నది. మిమ్మట్టే తేఱిచూచి పోవుచున్నాఁడు.

వేంకటేశ్వరుఁడును సత్యవతి మాటలువిని వింతపడెను. కారణములేక దారిఁబోవువాని నెట్లు పట్టుట యని యాలోచించెను. మహమ్మదీయ యువకుఁ డింత నొక్కి చెప్పుచుండ సందేహించుట యేలయని యెంచెను. ఏ నేరమునకై వానిం బట్టవలయునని తలఁచెను. అనుమానింపఁదగిన వాఁడని బంధింతునాయని యోజించెను. అట్లనుమానింపఁదగిన చిహ్నములెవ్వియు నాతనిపైఁ గన్పట్టమి మౌన మవలంబించి యుండెను. ఇది తెలిసిన సత్యవతియు నాతని చెవిలో;

సత్య.— ఆలసింపకుఁడు. వీఁడొక నగను దొంగిలి తెచ్చియున్నాఁడు. వీనింబట్టినచో మీకది దొరుకఁగలదు.

వేంకటేశ్వరుఁడును నిజసేవకులకు వానిఁబట్ట నానతిచ్చెను. రక్షకభటులును వాని వెంబడించిరి. ముదుసలికిని వారు తనసమీపమునకు వచ్చునంతదనుక ఏదియును దెలియకుండెను. సేవకులు చెంతకు రాఁగనే, వారెచ్చటఁ దన్నానవాలు పట్టిరో యని సంశయించెను. వారినుండి తప్పుట యెట్లని యాలోచించెను. తుదకు మంచిమాటలతో వారి బారినుండి తప్పనెంచెను.

ముదుసలి.—అయ్యలారా! నేనీరేయిం బరుండఁదగిన సత్రమేదేనుండిన సెలవిండు.

సేవకులు.-మీ రీదియూరు గాదని భావించుచున్నారము.

ముదుసలి.—నా దీ యూరుగాదు. దిక్కులేక యచ్చటచ్చట బిచ్చమెత్తికొనుచు బ్రదుకువాఁడను.

సేవక.—మీకుఁ బరుండుటకుఁ దగిన ప్రదేశమును జూపెదము. మా వెంటరండు.

అని యిటు మాటలాడుచు వారా ముదుసలిని నాల్గు వైపులను జుట్టి పోవుచుండిరి. వేంకటేశ్వరుఁడును సత్యవతియు నటకువచ్చిరి. ముదుసలియు, ఇట్టి సమయమునఁ దనయొద్ద నా చంద్రహారముండుట సరికాదని యెంచెను. దాని నెచ్చట నైనఁ బాఱవేయ నెంచి; కాలుజాఱి క్రిందఁబడులాగున నభి నయించుచు; ఆ సందడిని చంద్రహారమును జెంతనుండు నొక గోడయందలి గూటఁ బాఱవైచెను. రక్షకభటులు గాని వేంకటేశ్వరుఁడు గాని దీనిని గనిపెట్టలేదు. సత్యవతి యది గాంచి వేంకటేశ్వరునకు రహస్యముగా నెఱుకపఱచెను. అతఁడును దాని నెత్తికొని;

వేంకటేశ్వర. — ఈ చంద్రహారము మీ కెచ్చట దొరికెను?

ముదుసలి.—చంద్రహారమా! ఎచ్చటిది! నాకేమి తెలియును? నన్నుజూచినచోఁ జంద్రహారము దాల్చువాఁడ నని మీకుఁ దోఁచుచున్నదియా!

వేంకటేశ్వర.—మీకేకదా యిప్పు డీగూటఁ బడ వైచితిరి?

ముదుసలి.—రక్షకభటుల కెప్పు డేలాభమును కుండునో యప్పుడెల్లను నిట్లెవరిపైననైనను దప్పులు గల్పిం చుట యలవాటు. ధనవంతులపై నిట్టివి గల్పించిన మీకు

లాభముండునుగాని నా యట్టి బీదవానిం బట్టిన మీ కేమి యుపయోగము?

సత్య.—ఇది కల్పితమెట్లగు? మీ రింతకుమున్నొక బాలుని మెడనుండి దీనిని దీయలేదా!

ముదుసలి.—ఓ యువకుఁడా! నీ వీ వయసుననే యిట్లు సత్యము పలుకఁ బూనినవో నిఁక నెట్లు వృద్ధికి రాఁగలవు?

వేంకటేశ్వర.—మీ రెట్లు చెప్పినను మిమ్ము మేము వదల నెంచలేము. కాఁబట్టి మీరు మాయధీనముననే యుండ వలయును?

ముదుసలి.—అయ్యా! నిరపరాధిని. నన్ను వదలుఁడు.

వేంకటేశ్వర.—ఈ చంద్రహారము మీరొక బాలుని కంఠమునుండి యెత్తిన లాగునను, ఈ గూఁటఁబడవైచిన లాగునను సాక్షియుండుటచే మిమ్ము వదలుటకు వీలుగాదు.

ముదుసలి.—అయిన నేమిసేయుదురు?

వేంకటేశ్వర.—మీ రొనర్చిన తప్పునకుఁ దగినశిక్ష విధింపఁజేసెదను.

ముదుసలి.—అది మీ కసాధ్యము?

వేంకటేశ్వర.—ఏల?

ముదుసలి.—నన్ను శిక్షింపఁ జాలెడివాఁ డాయీశ్వరుఁడుదక్క నింకెరును లేరని భావింపుఁడు.

సత్యవతి.—ఈతని వైఖరిం బట్టి చూడ మహా మాయావి యగునని గోచరించెడిని.

ఈ మాటలు వినిన వేంకటేశ్వరుఁడు వింత వడెను.

ముదుసలియు నింక నెట్లును దప్పుటకు వీలులేదని నిశ్చయించెను. వీరిచేఁ జిక్కి యవస్థపడుటకంటె మరణించుట మేలనియెంచి చప్పునఁ గవచమునుండి యెద్దియో యెత్తి నోట వైచుకొనుచుండెను. ఇది కనిపెట్టిన వేంకటేశ్వరుఁ డాతని హస్తమును బట్టికొనఁజూచెను. కాని యంతలోననే అతఁ డాయౌషధమును నోటవైచికొనెను. వేంకటేశ్వరుఁడు నది విషమిశ్రమగు నౌషధమగునని యెంచి నిజభటులతో వైద్యు నొక్కని బిలిచికొని రమ్మని పంపెను. అంత నా ముదుసలియు నాతనిఁగాంచి;

ముదుసలి.—అయ్యా! నే భుజించిన యది విషమిశ్రమగు నౌషధమే. దీనికి విఱుపు నాకుఁదక్క నింకేరికిని దెలియదు. ఏల వైద్యులఁ బిలపించి వృథాశ్రమ పుచ్చుకొనెదరు? బ్రదుకుపై నాశ విడనాడియే నేనీకార్య మాచరించితిని. చావనున్న నాకిఁక జంకేల? నా చరిత్రము చెప్పెద నాలకింపుఁడు.

వేంకటేశ్వర.—మీరు చెప్పుదానిని వ్రాసికొనెదను. దాని యందుగూడ సంతక మొనర్చునది.

ముదుసలి.—అట్లేకానిండు. అయ్యా! నా జన్మభూమి యమలాపురము. నాయది వైదికకులము. నా పేరు రామచంద్రశాస్త్రి. బాల్యముననే నా తల్లిదండ్రులు మరణించిరి. నా మేనమామ గారగు సత్యనారాయణశర్మగారు సర్పవరముననుండిరి. వారే నాకు సర్వవిద్యలనేర్పిరి. బాల్యమున నా ప్రజ్ఞయు, సమయ

స్ఫూర్తిమున్నగునవియుఁ గాంచిన వారలెల్లరును నేను పెద్ద వాఁడనైన యీవల ఏదియో గొప్ప కార్యములఁ జేసి మహాపురుషుఁడను గాఁబోయెదనని వచియించుచుండిరి. సత్యనారాయణ శర్మగారు తమ తనయను నాకిచ్చి వివాహము గావించిరి. నేనును బాల్యమున, ఏకార్యమునఁ బ్రసిద్ధి వడయఁ గలవాఁడనని యెంచుచుంటిని. ఒక్కొకతూఱి నూతన మతము నేదైనంగని పెట్టుదునాయని తలఁతును. వేఱొకపరి యప్పుడప్పుడే లోకమున వ్యాపించుచున్న నవనాగరకమును వృద్ధి పఱతునా యని యెంచుచుందును. ప్రకృతి శాస్త్రమునఁ బాండిత్యము గల్గి యుంట నందుఁ బెక్కు క్రొత్త త్రోవలు వెదకి ప్రసిద్ధి వడయ నెంచుచుంటిని. ఇట్లనేకవిధములుగాఁ జింతించుచుంటిని. నా బాల్యమిత్రుఁడగు వెంకఁడు బాల్యము నుండి యక్రమవర్తనుఁడై యుండెను. వాఁడు నియోగి బ్రాహ్మణుఁడు. వానిపేరాదిని వేంకటరత్నము. వానికిఁ దూర్పువారి సహవాసము కుదిరెను. వారి కన్య నొకదాని వివాహమాడి వారి కులమునఁ గలిసెను. అదిమొదలు వానికి వెంకఁడను పేరుగల్గెను. వానిసహవాసము మూలమున నాకును అనేక దుష్ప్రవర్తనలలవడెను. ఎట్టివాని సంతకము నైనను జేయఁగల్గియుంటిని. ఏలాటి యభియోగమునందైనను జంకు గొంకులేక సాక్షిగా రాఁ గల్గితిని. ఎంతటి వారినైనను మోసపుచ్చఁ జాలియుంటిని. అధికారుల యాశ్రయము లేకుండిన నా యక్రమములు వెలువడఁజాలునని యెంచి, మీ యింటఁ బౌరాణికుఁడనై కుదిరితి.

ఇట్లు కొంతకాలము జరిపినపిదప స్వాయముగా రూప్య ములముద్రింపవలయు ననెడి తలంపుగల్గెను. అందులకుగాఁ గాకి నాడలో నొక స్థలము గనిపెట్టితిని. వలయు నుపకరణము లను, మనుష్యసహాయమును బొందితిని. ముద్రణాలయపుఁ గార్యములు సాగుటకై దారిదోపిడి గాండ్రగుంపు నొకదానిని సిద్ధపఱచితిని. వంచనచే నేను సంపాదించు ధనమును, దారి దోపిళ్లచే సంపాదించు ద్రవ్యమును ముద్రణాలయమునందలి కూలీలున్నగు వారికిచ్చు వేతనమునకు సరిపోవుచుండెను. ముద్రణాలయ మారంభము చేసినప్పుడే దొంగ వెంకఁడు మున్నగు వారొక సభచేరి నాకు 'మహామాయావి' యను బిరు దము నొసఁగిరి. ముద్రణాలయ వ్యాపార మతిశయించు కొలఁ దిని ద్రవ్యముయొక్క యావశ్యకము మిక్కుటమగుటచే నా యక్రమ ప్రవర్తనము నధికమగుచుండెను. చెన్నపురి కరిగి యోగి వేషమునుండి వెండిని బంగారు గావింతునని యచ్చటి వారిని మోసగించి, వారి వెండి పాత్రములనెల్ల నపహరించి తిని. జ్యోతిష్క వేషముననుండి అచ్చటివారికి జాతకమున నమ్మ కముండుటచే జాతకఫలములఁ జెప్పుచు ప్రశ్నలడుగువారి కుత్త రములు చెప్పుచుఁ దన్మూలమున గొంత ద్రవ్య మార్జించితిని. ఇచ్చటికివచ్చి మీ తల్లిగారికి మీ భార్యపై నసూయ మెండగు లాగునఁ గలహములు గావించుచుంటిని. దానిమూలమున అప్పుడప్పుడును గొంత ద్రవ్యలాభము గల్గుచుండెడిది. సత్యవతి నపహరించి హింసించినచో మీకు వేఱొక వివా

హము గావింపవచ్చునని మీ తల్లిగారికి బోధించితిని. అందు లకుఁ బ్రతి ఫలముగా నాబిడయొద్దనుండి కాసుల పేరొకటి గ్రహించితిని.

మీ రమలాపురమునకుఁ బోయియుండునపుడు గాకి నాడయందుండు నామిత్రుఁడగు హుసేనును సత్యవతిం గొను లాగునఁ బురికొల్పితిని. అదియే తరుణమనియెంచి సత్యవతి కిష్టములేకుండినను మీ తల్లిగారి మూలమున నిర్బంధించి నాటక సందర్శనమునకు రావించితిని. అట నాబిడకు దప్పి యెత్తఁగా విషౌషధ మిశ్రితమగు పాలిప్పించితిని. దాన నామె మైమఱచియుండ హుసేనున కాబిడ నప్పఁజెప్పితిని. ఆకార్య మొనర్చినందులకై మీ తల్లిగారియొద్దఁ గొంత ద్రవ్యము హరించితిని. సాహెబునొద్ద విక్రయ ధనమను నెపముతోఁ గొంత ద్రవ్యము లాగితిని.

మీరు కాకినాడ నుండునట్టి తరుణమున మీకు ద్వితీయ వివాహము గావింప ధనశేశ్వరమున నొక వితంతువు నేర్పఱి చితిని. అందులకై యుభయపక్షములనుండియు లంచములు తీసి తిని. ఇది యెఱిఁగిన మీతల్లిగారు నను దూషించుటచేఁ గోపించి యానాఁటి రేయి మీ యింటఁగల సొమ్మెల్ల నప హరించి నా ముద్రణాలయమునఁ జేర్పించితిని. అది మొదలీ యూరనే మాఱువేసము పూని వసించుచున్నాను. వెంకఁడు మున్నగు నా మిత్రులెల్లరును శిక్షితులైరి. నేను సంపాదించిన ద్రవ్య మంతయు నశించెను. నల్వురలోఁ దలయెత్తుకొని

తిరుగఁజాల నంతటి స్థితి గలిగెను. ఇంత యయ్యును దురాశా పీడితుఁడనై యింతకాలము నునియుంటిని. ఇప్పుడు నాకీ సంసారమే భారముగఁ దోఁచుచున్నది. ఇంక నేమనఁజాలను. కాఁబట్టియే ధైర్యముపూని నా చరిత్రము సాంతముగ నుడివితిని.

ఈతఁడాడిన యీ విషయముల నెల్ల వేంకటేశ్వరుఁడు కాగితమున వ్రాసి యాతనిచే సంతకము చేయించెను. ఇంతకుమున్నే వేంకటేశ్వరుఁడు పంపిన సేవకుఁడొక వైద్యుని బిలిచికొనివచ్చెను. అతఁడేవియో కొన్ని యౌషధముల నుపయోగింపనెంచెను గాని రామచంద్రశాస్త్రి యాతనిం గాంచి;

రామ.—అయ్యా! మీ కేల యీ వ్యర్థపు కష్టము! నే మనుటకిచ్ఛగింపకయే ఆ విషౌషధమును భుజించితిని. ఆ యౌషధమునకు విఱుపు మీ కేరికినిఁ దెలియదు.

వైద్యుఁడు.—అట్లైనా యౌషధ మేదియో సెలవిమ్ము. అంత రామచంద్రశాస్త్రి తన కవచమునుండి యొక పొట్లము నెత్తి యాతనిచేతికిచ్చి;

రామచంద్ర.—ఇదియొక చూర్ణము. దీనిని నీటిలోఁ గలిపి భుజించినచో నేఁ దినిన విషౌషధము విఱిగిపోవును.

వైద్యుఁడు.—ఇప్పుడు మిము నిర్బంధించి ఆ యౌషధ మును బోసెదము.

రామచంద్ర.—నేఁదినినదాని ప్రభావము దెలియక

మీరీలాగున నాడుచున్నారు. అది భుజించినయైదునిముసముల లోపల దీనిఁ దినవలసియుండెను. ఇంక మీ రేమొనర్చినను లాభములేదు. అని యాడుచునే యాతఁడు నేలఁబడెను. శరీరము వణఁకసాగెను. వణుఁకుతోఁబాటు జ్వరమునువచ్చెను. తలతిరుగుట కారంభించెను. నాలుక యెండువాఱఁజొచ్చెను. మాటలు తడఁబడఁసాగెను. అంత నాతఁడెట్లో యోపిక పట్టుకొని స-త్య-వ-తి-ప-తి-వ్ర-త-నే-నే-దు-ర్మా-ర్గుఁ-డ-ను అనుచు మరణించెను.



## పదునేడవ ప్రకరణము.

# మాయాసన్న్యాసి



వేంకటేశ్వరున కిప్పుడు తీరుబా టధికముగా నున్నది. దొంగలబాధ యెచ్చటను లేక గోదావరీ మండల మత్యంత సుఖమున గాటపట్టై యున్నయది. వేంకటేశ్వరునకుఁ దనపై నుండు భారమంతియుఁ దగ్గియుండుటచే మానస మిప్పుడు సుఖము ననుభవింపఁ గోరుచున్నది. ఏమిచేయఁ గలఁడు? భార్యయుండు స్థలమో తెలియకున్నది. ఆగ్రహపరవశుఁడై జననిని సోదరి నింటినుండి తఱిమివైచి యుండెను. ఇంటిలో నాఁడు దిక్కులేనందున సకాలమున రుచ్యములగు భోజనాదు

లమరకుండుటచే నొక వంటవాని నేర్పఱిచికొనియెను. వాఁడు జీతముకొఱకు, నెల యింక నెన్ని తేదులవఱకుఁ గలదని దినముల నెదురుచూచువాఁడే కాని యజమానునకు నోటికి రుచిగ నేమి చేసి పెట్టుటయను తలంపావంతయు గల్గకుండెను. వాని వలన నుపయోగ మింతైనను లేకుండుటచే, వానిని వెడల నడిపెను. ఇప్పుడు తానే వండుకొనుచున్నాఁడు. ఒక్కనాఁడు తనయింటి వసారాలోని కుర్చీపై నానికొని కూర్చుండి యిట్లని చింతించుచుండెను.

"సత్యవతి యిప్పు డెక్కడ నెమకొ నగును! కాకినాడ యందుండినచో చేనన్ని త్రోజులఁగయుండి నాకు గోచరింప కుండునే? దోపిడియను నదేశమున నను జూడకుండునే? నా స్వభావ మెఱిఁగినది సన్నిప్పుడు నాలాగున భావింపదు. నా తల్లి మున్నగువారు వచ్చి చు కొంతములమూలమున నేనచ్చట నాగ్రహము పొందియున్నాఁడనో యని యెంచి నను జూడ కుండునే? పతివ్రతామతల్లియగు సత్యవతి నే నంగీకరింప కున్నను నాయింట దాస్యమునకైన నంగీకరించును గాని పరి గృహవాసమున కియ్యకొనునది కాదు. ఇప్పు డెక్కడనుండు నదియుఁ గనుఁగొను టెట్లు? కాలువిఱిగి యింతటి యాపదలో నుండ నది యచ్చటనుండిన వచ్చి చూడకుండు నంతటి కఠిన హృదయ గాదు.

మామామగారీయూరికివచ్చి యిన్నిదినము లాయెఁ గా! వీరి నెన్నియో పర్యాయములు పంధించి యున్నాను.

నాతో వా రెన్నియో విషయములు సంప్రతించియున్నారు. ఒక్కసారియైనను దమకూఁతు విషయమై యొక్కమాటయైన నాడి యెఱుఁగరు. తుదకుఁ బసివాఁడగు ప్రకాశమును దాని విషయమై యొక్కమాటయైన నాడి యెఱుఁగఁడు. కారణ మేమైయుండును ? సత్యవతి వీరియింట నున్నదియా ! అట్లుండినచోఁ దాను నిర్దుష్టయనుట సాహెబు మూలమునను శాస్త్రిమూలమునను విశదమయినదనుట యెఱుఁగకుండదుగదా ! అట్టియెడ దుఃఖితుఁడనగు నన్నుపేక్షించి యూరకుండునే ! సత్యవతి వారియింట లేకుండిన వా రెప్పుడైన నాబిడయొక్క ప్రస్తావ మెత్తి యుండరా ! తప్పక వారియింట నుండియే తీరవలయును. కాఁబట్టియే నన్నావిషయమడిగి నా మానసము నొప్పింప నియ్యకొనక మౌనమవలంబించి యున్నవారు.

నేనిప్పుడు మా మామగారి యింటికేఁ బోయి, 'నా భార్యను నాయింటికిఁ బంపుఁడని యడుగుదునా ? అది యలౌకికము. ఇంతకును సత్యవతి యచ్చటనున్నదని నిశ్చయమెట్లు చేయుట ? కేవల మూహల నాధారము గావించుకొని వారి నట్లడుగుట తగదు."

ఇట్లనేక విధములుగాఁ దలపోయుచుండ. తారానాథ సింగట కరుదెంచి ;

తారానాథ.—అయ్యా ! వాకిట నొక సన్న్యాసి

వచ్చియున్నారు. వారు తమ దర్శనమున కెదురుచూచు చున్నారు. సెలవైనచోఁ బిలిచికొని వచ్చెదను.

వేంకటేశ్వర.---ఆలసింపక వెంటనే తోడికొనిరమ్ము.

తారానాథసింగును వారి యానతి మేరకు వాకిట నుండు సన్న్యాసి నచ్చటికిఁ బిలిచికొనివచ్చెను. వేంకటేశ్వరుఁడును వచ్చిన యాతని నాసనమునఁ గూర్చుండ నియమించెను. అర్ఘ్యవిధి నాతని బూజించెను. సన్న్యాసియు వేంకటేశ్వరుని గాంచి ;

సన్న్యాసి.—అర్య ! నే నియూరికిఁ గ్రొత్తవాఁడను. తాము మిక్కిలి ధర్మాత్ములని తెలిసి తమ దర్శనము పుణ్యప్రదమనియెంచి చూడవచ్చితిని.

వేంకటేశ్వర.—లోకమున నెందఱో తమ ప్రాణములుగూడ యాచకుల కిచ్చునట్టి ధర్మాత్ములుగలరు. అట్టివారి యెదుట నే నెంతటివాఁడనగుదును? నేనంతటి పొగడికకుఁ దగువాఁడనుగాను. అయినను దాము వచించున వెల్ల దీవెనలని గ్రహించువాఁడను. ఇంతదూరము దయచేసిన మిమ్మూరికి పంపు టుచితముగాదు. కాఁబట్టి యిదె నా చేతనుండు నీ పది రూప్యముల నందికొనుఁడు. ఇది స్వల్పమని భావింపకుఁడు. ప్రీతితోఁ బెట్టునన్నము పిడికెఁడైనను దృప్తికరమనుట మీ రెఱుఁగనిది కాదు కదా!

సన్న్యాసి.—(నవ్వుచు) ధర్మశబ్దమునకు బాగుగ నర్థముచేసితిరి. ధర్మమనిన దానము చేయుట మాత్రమే యని

నా యర్థము కాదు. సత్కార్యము లాచరించుటయే ధర్మము. అట్టివారి దర్శన మఖండ పుణ్యమున కాస్పదము. నశ్వరమగు నీ ద్రవ్యమును గోరి వచ్చినవాఁడనుగాను. సర్వసంగ పరిత్యాగి యగు నాబోటివానికి ద్రవ్యముతో నేమిపనియున్నది! ఆఁకలి యగునపు డేచెట్టునన్నైన నొక పండు దొరకదా! దప్పి యెత్తిన నేగుంటయో బావియో చిక్కకుండునా! నిద్ర వచ్చిన నేచెట్టునీడయో గుట్టయో లభింపదా! అట్టివారిట్టి నీచపుద్రవ్యము నపేక్షింప నేల?

వేంకటేశ్వర. — ఈ ద్రవ్యము మీ కుపయోగ శూన్యమేయగుఁగాక. ఇచ్చువారల మనస్సంతుష్టి కొఱ కైనను గ్రహింపవచ్చునను గాదె!

సన్న్యాసి.—తీసికొని మే మేమిచేయుట?

వేంకటేశ్వర.—దీని నేదేనొక సత్కార్యమున కుప యోగింపవచ్చును.

సన్న్యాసి.—సన్న్యాసులగు మేము సర్వకార్యములువీడి భగవంతునిపై భారమునైచి యుండువారము. మాకాచరింప వలసిన కార్యమేదియు నుండదు. మీరే యాద్రవ్యముతో సద్ధర్మాచరణము సేయుఁడు. మే మూరక మీ దర్శనమునకై వచ్చియుంటిమి. అది యాయెను. ఇంకఁబోయెదము. తా మేదియో యాలోచించుచుండు లాగునఁ బొడఁగట్టుచున్నది. అట్టి యెడఁ దమకు విఘ్నము గల్పించినందులకు మన్నింప వేఁడుచున్నవారము.

వేంకటేశ్వర.---నే నేయాలోచనయును జేయుచుండ లేదు. తమరాక నా కెట్టి విఘ్నము నాపాదించినది కాదు.

సన్న్యాసి.---మీ రెంత చెప్పినను మీ ముఖము చూచి నంతనే మీ రాలోచనా నిమగ్నులయి యుంటిరని తెలియు చున్నది.

వేంకటేశ్వర.---స్వామీ! మీ రాడిన లాగున నేనాలోచనానిమగ్నుఁడనై యుండినమాట వాస్తవమే యగును గాని, మీ రాక మాత్ర మందులకు విఘ్నకారియని యెంచవలదు.

సన్న్యాసి.---ఆలోచనా నిమగ్నులై యుండ సన్న్యాసు లరుదెంచి ఆ యాగ మనమందులకు విఘాతము సేయ లేదనిన నమ్ముదెట్లు?

వేంకటేశ్వర.---నా యీ యాలోచన జన్మ ముందు నంతవఱకు నుండునది. శాశ్వతమగు దీనికి విఘ్నమను మాట యొకటి గలదా!

సన్న్యాసి.---నిర్వహణీయమగు కార్యమునకుఁ గదా యాలోచించుట! అట్లుండ మీరిట్లాడుట నాకు బోధపడ లేదు.

వేంకటేశ్వర.---కార్య మిట్టిదని చెప్పినఁగాని మీ కది బోధపడదు. కాఁబట్టి చెప్పెద వినుఁడు. నాభార్య కానక పోవుటయే నా యాలోచనకుఁ గారణము.

సన్న్యాసి.---కానకపోయెననిన నా కర్థము కాలేదు.

వేంకటేశ్వర.---మా తల్లియు నాసోదరియు నొక బ్రాహ్మణుఁడును జేరి యాడిడ నొక మహమ్మదీయున కమ్మిరి కాని ఆ మహమ్మదీయుని సోదరి నాభార్య కెట్టి భంగమును

గల్గకుండములాగున గాపాడెను. అటనుండి యెటుపోయినదియుఁ దెలియకున్నది.

సన్న్యాసి.---మహమ్మదీయుని పాలైనదానిని గుఱించియా యింత విచారిపడుచున్నారు!

వేంకటేశ్వర.--- అతఁడు తీసికొనిపోయినను ఎట్టి భంగమును గలుగలేదని కదా వచియించియుంటిని!

సన్న్యాసి.---అది నమ్ముటెట్లు?

వేంకటేశ్వర.---ఆ మహమ్మదీయుఁడే నాతో నట్లు చెప్పియున్నవాఁడు.

సన్న్యాసి.---తప్పుచేసిన వాఁడింకెట్లు చెప్పును?

వేంకటేశ్వర.---వాఁడంతటి నీచుఁడుగాఁడు.

సన్న్యాసి.---పరకాంతను విలుచుట యధర్మమగును గదా! అట్టికార్య మాచరించినవాఁడు నీచుఁడుగాఁడా! భార్య యందుఁగల యభిమానమున మీరెట్లాడినను మాబోటి వారికీమాట నచ్చునదికాదు. ఇంక మీరాచింత మానుటయే యుక్తమని నాకుఁ దోఁచుచున్నది.

వేంకటేశ్వర.---నిర్దుష్టయని నామనసెఱిఁగి యుండ నన్యుల యాడికోలున కేనేల జడియుదును?

సన్న్యాసి.---శ్రీరామచంద్రు నంతటివాఁడు నూరివారి మాటలకు జడిసియే భార్యను గాన పాలు గావించెను.

వేంకటేశ్వర.---మీరెట్లైనను జెప్పుఁడు. నామతమది కాదు.

సన్న్యాసి.---అయిన లోకుల దూషణమునకుఁ బాత్రులై కలకాలమును దలవంచికొని యుండవలసి వచ్చును.

ఈ మాట వినినంతనే వేంకటేశ్వరున కాగ్రహము మెండయ్యెను. అంత నతఁడు, "ఇంక నీ సన్న్యాసిమాటవినఁగూడదు. ఈతని నిచ్చటినుండి శీఘ్రముగా నంపుట మేలు" అని యెంచి యాతనింగాంచి;

వేంకటేశ్వర.---అయ్యా! తామింక నీ విషయమున జోక్యము కలిగించుకొనవలదని వేఁడువాఁడను.

సన్న్యాసి.---అయిన నాకు సెలవిండు.

అని సన్న్యాసి తాను వచ్చినదారి నరిగెను. తారానాథసింగు నచటికివచ్చి వేంకటేశ్వరుని చేతికొక కమ్మనిచ్చెను. అది వెంకటప్పలయ్యగారు తమ భటుని మూలమునఁబంపిరని చెప్పెను. అందీలాగున నుండెను.

రాజమహేంద్రవరము.

అల్లుఁడుగారగు వేంకటేశ్వరుఁడుగారికి.

మా తోఁటయందు సత్యప్రకాశినీ సమాజము వారొక నాటకమును బ్రదర్శింపఁ బోయెదరు. మిత్రులనేకు లచ్చటికి వచ్చెదరు. కాఁబట్టి మీరెల్లరును మిత్రవర్గముతోఁడఁ దప్పక యచ్చటికి రావలయును.

ఇట్లు,

వెంకటప్పలయ్య.

ఈ జాబు చూచినంతనే యాతఁడిట్లు తలపోయఁ దొడఁగెను.

"నాటకముచూడ నరుగునపుడు నే నొంటరిగాఁ గదా పోవలయును! వారో మీరెల్లరునని జాబున వ్రాసియున్న వారు. అచ్చటికిఁబోయినచో నెట్లును 'మీభార్యనేల పిలిచి కొని రాకుంటి'రని యడుగక మానరు. అప్పట్టున నేమిచెప్పు ట! నే నచ్చటికిఁబోక యుండిన నీ సంకటము లేకుండును గదా! అది యునెట్లు సరియగును! అప్పు డలక్ష్యము చేసితి ననిక దా భావింతురు? 'ముందుఁ బోయిననూయి వెనుకకు వచ్చినఁ గోయి' యనులాగునఁ గదాయున్నది! ఏమిచేయు దును? ఎవ్వనితోడ నాలోచింతును! సరి. కానున్నది కాక మానదు. ఎట్లైనను బోయియే తీరవలయును."

అని యెంచి తన మదినొకలాగునఁ బదిలపఱచికొనెను.



పదునెనిమిదవ ప్రకరణము.

# సత్యావిష్కరణము.



మండల న్యాయాధిపతిగారగు వెంకటప్పలయ్యగారి తోఁటలో నొకవైపున పెద్దపందిలి వేయఁబడి యుండెను. అం దాదినము నాటక మొక్కటి ప్రదర్శింపవలసి యుండుటచే రంగస్థల మొండ మరియుండెను. రంగస్థలమునకు వెలు పలఁ బ్రేక్షకు లాసీనులై యుండుటకుఁగాఁ గొన్ని కురిచీ లుండెను. వెంకటప్పలయ్యగారును, వేంకటేశ్వరుఁడును, బ్రకా

శము నచట నాసీనులై యుండిరి. వేంకటేశ్వరుఁడు దానొక్క రుఁడు దక్కఁ గ్రొత్తవా రెవ్వరు నటకు రానందుల కాశ్చర్య పడఁజొచ్చెను. నాటక దర్శనమున కరిగియే సత్యవతి తిరో ధానమంది యుండుటచే, ఈనాటక దర్శనము మూలమున మరలఁ దన భార్యయొక్క దర్శనమగునేమో యని యాలో చించెను. అదృష్టహీనుఁడగు తనకట్లు కల్గుట యసంభవమని యెంచెను. నాటక ముపక్రమించు వేళయాయెను. ముందు వైపుననుండు యవనిక పైకి లాగఁబడెను.

---

మొదటి రంగము.

---

రంగస్థలమున, ఎదుట నొక శయ్యాగృహపు టంతర్భా గము. అందొక యువుఁదుది మంచముపైఁ బరుండి నిదురించు చుండెను. చెంతనుండు కుర్చీపై మహమ్మదీయ యువకుఁ డొకఁ డాసీనుఁడై యుండెను. నిదురించు చుండిన వనిత యొక్కతూఁటి తుమ్మెను. వెంటనే కన్నులు తెఱచెను. చెంత నాసీనుఁడై యుండు మహమ్మదీయ యువకుని జూచి చప్పున లేవఁ బోయెను. శరీరమున సత్తువలేమి నది సాధ్యముకాక మరల మంచముపైఁ బడెను. మరల నెట్లో అతి ప్రయాసము పై లేచి ఎదుటివానిం గాంచి;

ఆఁడుది.—అయ్యో! నేనిచ్చట నున్నదాన? మా యత్తగారును, ఆఁడుబిడ్డయు నిచ్చటికరిగిరి?

మహమ్మదీయ.—లలనా! మీయత్తయును ఆశాస్త్రి యును నిను జంపనెంచి విషమిశ్రమగు నౌషధమును బెట్టిరి.

ఇది తెలిసి నేను వారిం బెదిరించి నిను గొనివచ్చి యీమందు నకు విలువు నుపయోగించి నీయాపద దప్పించితిని.

ఆఁడు.__నాకుఁ బ్రాణదాన మొసఁగిన వారియెడ నే నెంతయుఁ గృతజ్ఞురాలను. నాభర్తగారికి వర్తమానమంపి పిలిపింపుఁడు.

మహమ్మదీయ.__మానినీ! తల్లికి లోఁబడి నిను విడువఁ దలఁచినవాఁడు నీకేమి మేలు సేయఁగలఁడు!

ఆఁడు.__వారెట్లున్నను నేను వారి చరణ దాసినే యగుదును.

మహమ్మదీయ.__ప్రీతిరహితుని మూలమున నీవేమి సుఖము వడయఁగలవు?

ఆఁడు.—వారి సమీపవర్తిని యగుటయే నాకుఁ బరమ సుఖము.

మహమ్మదీయ.—కొంతవడి కోర్చికొనుము. నీప్రాణ ములఁ గాపాడిన వాఁడను, నీకు సుఖము గల్గుదారిని వెదుక కుందునా!

ఆఁడు.__అట్లే నిప్పుడు మీరేమి సేయమందురు?

మహమ్మదీయ.__నీ ప్రాణరక్షకుఁడగు నాయెడ నీవు కృతజ్ఞురాలవగుట నిశ్చయమేని నీపైఁ బ్రీతి నుంపని యాతని యెడ నపేక్షమాని నను వివాహ మాడుము.

ఆఁడు.__(కోపించి) ఓరీ దురాత్మా! నీయభిప్రాయ మిదియా! ఈయాశ నీనాశమునకు హేతువగుననుట యెఱుఁగఁ జాలకున్నావు.

ఈమాట లాలించినంతన వేంకటేశ్వరున కాగ్రహము మెండయ్యెను. ఆఁపరాని యా వేశముతో వాని నఱుకఁ దలఁచి కత్తినెత్తుకొని లేచి నిలువఁబడెను. అతనిఁజూచి నవ్వుచుఁ బ్రకాశము;

ప్రకాశము.—బావా! ఏల యిట్టి యావేశముతోడ లేచుచున్నాఁడవు?

వేంకటేశ్వర.—ఇదెచూడుము. మీ యక్క యెట్టి యిక్కట్టులకుఁ బాలగుచున్నదో!

ప్రకాశము.—మా యక్క మీ యింటనే యున్న దిగా! ఆమె కేమి యిక్కట్టు వాటిలఁగలదు? అడుగ మఱచి తిని. ఈ దినమున నాటక సందర్శనమునకు వచ్చువాఁడవు ఆ బిడ నేల తోడ్కొని రాలేదు?

వేంకటేశ్వరున కామాటకు బదులేమి చెప్పుటకును దోఁచకుండెను. విని తోట్రుపాటు గాంచి కనికరమందిన వెంకటప్పలయ్యగారు;

వెంకటప్పలయ్య.—నాయనా! ప్రకాశమూ! నాటక దర్శనమునకు రమ్మని వారి నాహ్వానించితిమి గాని, సత్యవతిం గూడఁ దోడి తేవలయునని వ్రాయమైతిమిగదా! అట్లుండ వారేల పిలిచికొనివత్తురు? అయ్యా! వేంకటేశ్వరుఁడు గారూ! ఇది నాటకము కదా! మీకేల యింతటి చిత్త చాంచల్యము?

వేంకటేశ్వరుఁ డేమియును దోఁచక యట్లేనిలిచెను. ఆవల నిట్లాలోచింపఁ దొడఁగెను.

"రంగస్థలమునఁ గానవచ్చువారు సత్యవతీ హుసేను లేగాని యన్యులుగారు. సత్యవతి యిట కెట్లువచ్చెను? నేనిటకు వచ్చునపు డింటినిగాచికొని యుండులాగున నేర్పఱచివచ్చిన యీ హుసేనెట్లు రాఁగలిగెను? రూపసామ్యముంబట్టి భ్రమ సెందియుండ నోపుదును. మా మామగారు నిది నాటకమని కదావచించుచున్నారు. అట్లయిన వీరీ నాటకము నాడిం చుటకుఁ గతి మేమియుండును? నన్నవమానము సేయుటకా! అట్లుండదు. తమ బిడ్డయొక్క వృత్తాంతము ఇంతకు మున్నె యెఱిఁగి యుండిన వారా వృత్తాంత మెప్పుడైన నెత్తియుండరా! ఎత్తిన నేనెచ్చట నొచ్చికొందునో యని యూరకుండరాదా! అట్టివా రిప్పుడీ నాటకము మాత్ర మెట్లాడింతురు! ఇది యంతయు నాకద్యోమయముగనున్నది." అని యిట్లు చింతించుచుఁ గురిచీపైఁ గూర్చుండెను. రంగస్థలమున మహమ్మదీయ యువ కుఁడు.—

మహమ్మదీయ.—ఓసీ! నీమాటకు నే జంకువాఁడను గాను. బలిమినైనను నిన్ను వివాహ మాడెదను.

ఆఁడు.—(మిక్కిలి దుఃఖముతో) హా! అశరణయగు నన్ను రక్షించు వారెవ్వరును లేరా! పరమేశ్వరా! పూర్వ ము ద్రోవదిని రక్షించి దాని శీలమును గాపాడితివని విన్న నుచున్నారు. అది యెవరును జూచినవారుకారు. ఇప్పుడు ప్రత్యక్షమున నన్ను రక్షించి యాబిరుదమును సార్థకపఱచి కొనుము.

అని యిట్లా యూఁడుది బిగ్గఱగా నఱచుచుండెను. అప్పుడొక మహమ్మదీయాంగన ప్రవేశించెను. ఆబిడను జూడఁగనే యా మహమ్మదీయ యువకుఁడు నివ్వెఱపడెను. ఆమెయుఁ గ్రోధదృష్టి నాతనిం జూచుచు;

మహమ్మదీయాంగన.—ఓరీ! నీచా! నాయింట నిట్టి యక్రమాచరణమున కుపక్రమింపఁ జూచెదవా! ఇఁక సోదరుఁడవని కనికర ముంచను. ఇప్పుడే యిటనుండి వెడలుము. మహమ్మదీయుఁడు నేమియు బదులాడలేక తలవంచికొని నిష్క్రమించెను.

అంత యవనిక దిగ జాఱెను.

---

రెండవరంగము.

---

యవనిక పైకి లాగఁబడెను.

రంగస్థలమునఁ ఎదుట నొక వైద్యశాల. అట నొక మహమ్మదీయాంగనయు నొక క్రైస్తవ వనితయు నాసనముల నాసీనలై యుండిరి.

మహమ్మదీయాంగన. — అమ్మా! నిన్నిప్పుడేరును పొందూనవనిత వని యానవాలు బట్టలేరు. ఇంక నీవేషము తోడఁ గాలువిడిచి యీ వైద్యశాలయందు నీ భర్తకుఁ బరిచర్యలు గావింపవచ్చును. పొరపాటున నెప్పుడేని బయలు పడఁ బోయెదవుసుమీ. జాగ్రత్త. నేనిచ్చటి వైద్యునితోఁ జెప్పి రోగులకు శుశ్రూషకురాలుగా నియమించునట్లేర్పాటు గావించియున్నాను. అప్పుడప్పుడును నీక్షేమ మారయుచుందును.

అని నిష్క్రమించెను.

ఆఁడు. — ఆహా! నా వ్రాఁతకేమనుదాన! నాఁడపరాధపరిశోధక వేషమున మావారిని సమీపించినపుడును నిజస్థితి నెఱుకపఱుప వీలుగాదయ్యె. నేఁడును గుప్తముగానే యుండవలసెను. ఎంతకాల మిట్టి మాయవేసము లూని యుండుదానను? అయినను దగినసమయమున వారి పాద సేవసేయు భాగ్యము లభింపఁజేసిన యా దైవమును నే నెంతయుఁ గొనియాడుదాన.

ఇది వినుచుండిన వేంకటేశ్వరునకు అది మాయానాటకమే యని తోఁచెను. ఆక్రైస్తవ వనిత తన కప్పుడు పరిచర్యగావించిన యావిడయేకాని యన్యగాదనుట గనిపెట్టెను. "కాలువిఱిగి యీ వైద్యశాలలోనుండు భర్తకు." అనుటచే నందలి వాస్తవస్థితి యతని కెఱుకపడియెను. సత్యవతి వారి యింటనే యున్నదనియు నావిడయే యిప్పుడీ రంగస్థలమున నున్నదనియుఁ దెలిసికొనెను. మామగారు నాటక వ్యాజమున నావిడ నిర్దుష్టయని నిరూపించు చున్నారని భావించెను. వెంకటప్పలయ్యగారితో తన యాచరించిన కార్య మనయ భూయిష్ఠమని వినయములోడ విన్నవింప నెంచి లేచెను. వారి పాదములపైఁబడి తన యపరాధమును మన్నించి భార్యను దనయింటికంపఁ బ్రార్థింపఁ దలఁచెను.

ఇంతలోన వెంకటప్పలయ్య గారాతనిజూచి,

వెంకటప్పలయ్య. — మీ యీ మనశ్చాంచల్యము

మా కీనాటక సందర్శనమునఁ గల్గు రసమునకు భంగకారిగా నున్నది. మిమ్మిన్నిదినములుగా ధీరవరులని కదా భావించి యుంటిమి! ఇది యేమీ ధైర్యము!

వేంకటేశ్వరుఁడు.— కరుణారస భూయిష్ఠమగు నీ నాటక మెట్టివారి మనసును గలంపఁజాలునది. కాఁబట్టియే నాకింతటి మనశ్చాంచల్యము గల్గెను.

వెంకటప్పలయ్య.—మీవలె మేమును జూచుచూడ మాకుఁగల్గని యీచాంచల్యము మీకుమాత్ర మేలకల్గెన్?

వేంకటేశ్వర.—అది వారి వారి మనోదార్ఢ్యము ననుసరించియుండును.

ప్రకాశము.—బావగారు దృఢమనస్కులుగా రనుట నేఁడుకదా విశదమాయెను!

వేంకటేశ్వర.—నా యీస్థితియందుండు వారెల్లరు నిట్లె యుండఁగలరు.

వెంకటప్పలయ్య.—మీరిట్లు రసభంగముగావించుట బాగులేదు. కూర్చుండుఁడు.

అంత వేంకటేశము కేమిచెప్పుటకును దోఁచకుండెను. తనగుట్టు మామగారి కెఱుకపడియె ననుట యతనికిఁ దెలిసెను. లజ్జావిషాదము లొక్కుమ్మడి నాతని బాధించుటచే మౌనమవలంబించి యూరకుండెను.

ఆఁడుది.—నేనిఁక నాభర్తగారికిఁ బరిచర్యలు సేయ వలయుదానను.

అని నిష్క్రమించెను.

యవనిక జాఱెను.

---

మూఁడవ రంగము.

---

యవనిక పైకి లాగఁబడెను.

రంగమున నిష్పన్నలోక వీథి-ఒక మహమ్మదీయ యువకుఁడు ప్రవేశించెను.

మహమ్మదీయయువకుఁడు.-రెండు మూఁడు తూఱులు వేషము వేయుటచేతనే నాకిట్టి వేషధారణములందెంతటి సామర్థ్యము గల్గెను? ముందుఁబోవు నా మహమ్మదీయ వృద్ధుఁడు బాలుననుసరించుచున్నాఁడు. ఆ బాలకుని శరీరమున నుండు నగల నపహరింప నెంచి యట్లరుగులాగునఁదోఁచెడిని. కొంతవఱకు వీని ననుసరించి వీని చౌర్యమును గనిపెట్టి రక్షకభటులకు వీని నప్పగింపవలయును. ఒక్క యబలను బెక్కుర దొంగల నాఁడు నా భర్త కప్పగించితిఁగదా! అట్టి నాకిపుడు వీని నొక్కనిఁబట్టి యప్పగించుట కష్టతరమగునది కాదు. అవల నొక మాయా సన్న్యాసినై నాభర్తగారి మనోభావముగూడఁ గనిపెట్టెదను.

వేంకటేశ్వరుఁడు.—[లేచి నిలువఁబడి] సత్యవతీ! ఇంక నెన్ని వేషములు వేసికొని నన్ను మోసపుచ్చ నెంచి యున్నదానవు? నీ కిది భావ్యముగాదు.

వెంకటప్పలయ్య.—అల్లుఁడుగారు నేఁ డేలొకో యున్మత్తులగుచున్నారు?

వేంకటేశ్వర.—నిక్కముగ నా భార్యను విడనాడిన నాటినుండి యున్మత్తుఁడనే.

అనుచుఁ దటాలున రంగస్థలమునకరిగి యా మహమ్మదీయ యువకుని హస్తముపట్టికొనెను.

మహమ్మదీయ యువకుఁడు.—(నవ్వుచు) రంగస్థలములోనం బ్రవేశించి నాటకమున కిట్టి భంగము గల్గించుట న్యాయమా !

వేంకటేశ్వర.— మాయవేసములు వేసికొని పతిని వంచించుట పాడియగుటయు భార్యాయుంకు ప్రదేశమునకు భర్తవచ్చుట యన్యాయము నగునా !

మహమ్మదీయ వేషధారిణియగు సత్యవతి యిదివిని దుఃఖితురాలయ్యెను. తాను భర్తనట్లువంచించినది న్యాయము కాదని తలఁచినంతనే యీ యక్రమ ప్రవర్తనము మూలము దన శీలమునకు భంగము కల్గనేమో యని భీతిల్లెను. ఆ భయమున శరీరమువణఁకఁ జొచ్చెను. వెంటనే యాతని పాదములపై శిరము నుంచి నమస్కరించి, తడఁబడుచున్న కంఠముతోఁ దన యపరాధముల మన్నించి, తన్ను రక్షింప వేఁడికొనెను. కన్నుల నుండి నీరు కాల్వలు గట్టి పాఱి యాతని పాదములు దడుపనాగెను. వేంకటేశ్వరుఁడు నామెన బట్టి లేవనెత్తి ;

వేంకటేశ్వర.—కాంతా! అనాగత విధాతవై నిను నా వెంటఁ గొని పోవక యింటదిగ విడచిపోయిన దాని ఫలమిది. నా జననియొక్క స్వభావము తెలిసి నేనిట్లాచరించినది,

నా తెలివి లేమియ యగు. అట్టి యపకారిణులకు నాఁడు నీ వొనర్చిన యుపకృతి గడుంగడు శ్లాఘ్యము. పూర్ణాపరాధి యగు నాయెడ నీవు చూపినకనికరము శ్లాఘ్యతరము. కఠినహృదయుఁడనై యిన్నిదినములు నినువిడనాడియు జీవించి యున్న నాయందుఁ బ్రీతినుంచి యుండుట శ్లాఘ్యతమము.

అని యిట్లాడుచు నాబిడతోడ మామగారిచెంత కరుగు దెంచెను. వారికి నమస్కృతిసల్పి తన యపరాధముల మన్నింప వేఁడికొనెను. వెంకటప్పలయ్యగారు నాతని లేవనెత్తి కౌఁగి లించికొని ;

వెంకటప్పలయ్య.—మీపైనా కెప్పుడును గోపము లేదు. మీరు గాకినాడకు వెళ్లిన తరుణమున నన్నీయూరికి మార్చియుండుటచే నిటకువచ్చితిని. రాఁగనే సత్యవతీ తిరో ధానమువగతమయ్యెను. అందులకుఁ గారణ మారయుచుండ, మీ సేవకుఁడగు తారానాథసింగు మాటల మూలమున రామ చంద్రశాస్త్రి యిందులకుఁ గారకుఁడైయుండునని సందేహము కల్గెను. అతనిప్రవర్తనము నారయుచుండ మీ కొకవిధవ నంటు గట్టుట కాతఁడు ప్రయత్నించుచున్నట్టులుఁ బొడఁ గట్టెను. అంత నివిషయములు తెల్పుచు నొక జాబును మీతల్లిగారికి వ్రాసితిని. ఆమెయుఁ గోపించి శాస్త్రినింటి యొద్దకు రావలదనెను. అతఁడును గ్రోధమున మీయింటి ధనమెల్ల నపహరించి పలాయనమొనర్చెను. నాఁటినుండి యాతనిఁజాడ గాన్పింపలేదు. దొంగ వెంకఁడు మున్నగువారిని

విచారించు సమయమున నాతనయ నాయింటికివచ్చెను. తనయుడంత మా మూలాగ్రము వినిపించెను. అప్పుడే మీ కీవార్త యెఱుకపఱచి యుందునుగాని ఈబిడనిర్దుష్టురాలగుట మీకుఁ జక్కఁగాఁ దెలియువఱకు నీగుట్టురట్టు సేయ రాదని యూరకుంటిని. మీతల్లిగారిని, జానకమ్మను సింటి నుండి మీరు తఱిమివైచినది తెలిసి వారిని మాయింటనునిచి కొని కాపాడుచున్నాను. వారును సత్యవతీ సత్యవృత్తాంతము తెలియఁగనే అపకారులగు తమవిషయమున నాబిడచేసిన యుపకృతిచేఁ బశ్చాత్తప్తలైరి. ఇప్పుడువారు మంచి మనసు గల్గియున్నారు. వారిప్రవర్తిన మెంతయు బాగుగనున్నది. విశ్వనాథమునకు నీవర్తమానమంపి పిలిపించియున్నాను. అతఁడును దనభార్యయొక్క మంచి నడవడికలుచూచి మిక్కిలి యానందించు చున్నాఁడు. ఈదినము నాటక ప్రదర్శనము మూలమున మీకిది తెలియ పఱచుటకుఁ గారణము మీ మఱఁదియగు ప్రకాశమే యగును. కాఁబట్టిబాలుని యీ తప్పును మన్నింప వలయును.

అనిసేవకుని మూలమున విశ్వనాథమును; శేషమ్మను, జానకమ్మను, బిలిపించెను. వేంకటేశ్వరుఁడును దల్లి పాదముల పైఁబడి తాన ట్లెలు వెడల నడచి నందులకు క్షమింపఁ బ్రార్థించెను. ఆబిడయుఁ గుమారుని గాంచి;

శేషమ్మ.—తండ్రీ! ఇందు నీదోషమేమియును లేదు. అనీచుఁడు రామచంద్ర శాస్త్రిమాటలు విని పతివ్రతా మతల్లి

యగు నీభార్యయెడ నేనాచరించిన యపరాధమున కీశ్వరుఁడు నానావిధముల నన్నవమతి సేసెను. దాననే నాకు సద్బుద్ధి కల్గుటచే యది నామేలునకే యాయెను.

చిరవిరహవ్యథా వ్యాకులితుఁడగు వేంకటేశ్వరుఁడు సత్యవతీ సందర్శనమున నపారానంద మందెను. భార్యగుణవంతురాలగుటచే విశ్వనాథము సంతుష్టి నందెను. వెంకటప్పలయ్యగారు మున్నగువారు నట్టియఘటిత ఘటనమున కెంతయు మోదమందిరి. సత్యవతియు నాసత్యావిష్కరణమున కత్యంత సంతుష్టనూయెను. వారి నాదినమున దమయింట విందునకై నిలువమని వేంకటప్పలయ్యగారు వేఁడిరి. వారును వల్లెయని యంగీకరించిరి.

మఱునాఁటి యుదయమున వేంకటేశ్వరుఁడు మామగారిని వీడ్కొని; జననిని, సోదరిని, భార్యను విశ్వనాథమును వెంటనిడికొని తనయింటికి వచ్చెను. విశ్వనాథము గొంతకాల మత్తగారి యింటనుండి యావల భార్యాసహితుఁడై నెల్లూరునకు వెడలెను. హనుసేను సద్వర్తనుఁ డగుటచే నాతని వేంకటేశ్వరుఁడు రక్షకభటోద్యోగిగా నొనర్చెను. సత్యవతీ వేంకటేశ్వరు లొండొరుల నెడబాయక యత్యంత ప్రేమమున సుఖముండిరి.

సంపూర్ణము.

